ఓం 3 ఈ శక్త్యై నమః
ఓం 3 ఈప్సితార్థ ప్రదాయిన్యై నమః
ఓం 3 ఈదృగిత్య వినిర్దేశాయై నమః
ఓం 3 ఈశ్వరత్వ విధాయిన్యై నమః
ఓం 3 ఈశానాది బ్రహ్మమయ్యై నమః
ఓం 3 ఈశత్వాద్యష్ట -
- సిద్ధిదాయై నమః
ఓం 3 ఈ శక్త్యై నమః
ఓం 3 ఈక్షణ సృష్టాండ కోట్యై నమః
ఓం 3 ఈశ్వర వల్లభాయై నమః
ఓం 3 ఈడితాయై నమః
ఓం 3 ఈశ్వరార్ధాంగ శరీరాయై నమః
ఓం 3 ఈశాధి దేవతాయై నమః
ఓం 3 ఈశ్వరప్రేరణకర్త్యై నమః
ఓం 3 ఈశ తాండవ సాక్షిణ్యై నమః
ఓం 3 ఈశ్వరోత్సంగ -
- నిలయాయై నమః
ఓం 3 ఈతిబాధా వినాశిన్యై నమః
ఓం 3 ఈహా విరహితాయై నమః
ఓం 3 ఈశ శక్త్యై నమః
ఓం 3 ఈషత్స్మితాననాయై నమః
ఓం 3 లకార రూపాయై నమః
ఓం 3 లలితాయై నమః
ఓం 3 లక్ష్మీవాణీ నిషేవితాయై నమః
ఓం 3 లాకిన్యై నమః
ఓం 3 లలనా రూపాయై నమః
ఓం 3 లసద్దాడిమపాటలాయై నమః
ఓం 3 లలంతికా లసత్ఫాలాయై నమః
ఓం 3 లలాట నయనార్చితాయై నమః

ఓం 3 లక్షణోజ్జ్వల దివ్యాంగ్యై నమః
ఓం 3 లక్షకోట్యండ నాయికాయై నమః
ఓం 3 లక్ష్యార్థాయై నమః
ఓం 3 లక్షణాగమ్యాయై నమః
ఓం 3 లబ్ధకామాయై నమః
ఓం 3 లతాతనవే నమః
ఓం 3 లలామరాజదళికాయై నమః
ఓం 3 లంబముక్తాలతాంచితాయై నమః
ఓం 3 లంబోదరప్రసువే నమః
ఓం 3 లభ్యాయై నమః
ఓం 3 లజ్జాఢ్యాయై నమః
ఓం 3 లయవర్జితాయై నమః
ఓం 3 హ్రీంకారరూపాయై నమః
ఓం 3 హ్రీంకారనిలయాయై నమః
ఓం 3 హ్రీం పదప్రియాయై నమః
ఓం 3 హ్రీంకారబీజాయై నమః
ఓం 3 హ్రీంకారమంత్రాయై నమః
ఓం 3 హ్రీంకారలక్షణాయై నమః
ఓం 3 హ్రీంకారజపసుప్రీతాయై నమః
ఓం 3 హ్రీం మత్యై నమః
ఓం 3 హ్రీం విభూషణాయై నమః
ఓం 3 హ్రీం శీలాయై నమః
ఓం 3 హ్రీం పదారాధ్యాయై నమః
ఓం 3 హ్రీం గర్భాయై నమః
ఓం 3 హ్రీం పదాభిధాయై నమః
ఓం 3 హ్రీంకార వాచ్యాయై నమః
ఓం 3 హ్రీంకార పూజ్యాయై నమః
ఓం 3 హ్రీంకార పీఠికాయై నమః
ఓం 3 హ్రీంకార వేద్యాయై నమః

ఓం 3 హ్రీం కారచిన్త్యాయై నమః
ఓం 3 హ్రీం నమః
ఓం 3 హ్రీం శరీరిణ్యై నమః 100
ఓం 3 హకార రూపాయై నమః
ఓం 3 హలధృత్పూజితాయై నమః
ఓం 3 హరిణేక్షణాయై నమః
ఓం 3 హర ప్రియాయై నమః
ఓం 3 హరారాధ్యాయై నమః
ఓం 3 హరిబ్రహ్మేంద్ర -
- వందితాయై నమః
ఓం 3 హయారూఢా -
- సేవితాంఘ్ర్యై నమః
ఓం 3 హయమేధ సమర్చితాయై నమః
ఓం 3 హర్యక్ష వాహనాయై నమః
ఓం 3 హంసవాహనాయై నమః
ఓం 3 హతదానవాయై నమః
ఓం 3 హత్యాదిపాపశమన్యై నమః
ఓం 3 హరిదశ్వాదిసేవితాయై నమః
ఓం 3 హస్తి కుంభోత్తుంగ -
- కుచాయై నమః
ఓం 3 హస్తికృత్తి ప్రియాంగనాయై నమః
ఓం 3 హరిద్రా కుంకుమ దిగ్ధాయై నమః
ఓం 3 హర్యశ్వాద్యమరార్చితాయై నమః
ఓం 3 హరికేశసఖ్యై నమః
ఓం 3 హాదివిద్యాయై నమః
ఓం 3 హాలామదాలసాయై నమః
ఓం 3 సకారరూపాయై నమః
ఓం 3 సర్వజ్ఞాయై నమః
ఓం 3 సర్వేశ్యై నమః

ఓం 3 సర్వమంగళాయై నమః
ఓం 3 సర్వకర్త్ర్యై నమః
ఓం 3 సర్వభర్త్ర్యై నమః
ఓం 3 సర్వ హన్త్ర్యై నమః
ఓం 3 సనాతన్యై నమః
ఓం 3 సర్వానవద్యాయై నమః
ఓం 3 సర్వాంగ సుందర్యై నమః
ఓం 3 సర్వ సాక్షిణ్యై నమః
ఓం 3 సర్వాత్మికాయై నమః
ఓం 3 సర్వ సౌఖ్యదాత్ర్యై నమః
ఓం 3 సర్వ విమోహిన్యై నమః
ఓం 3 సర్వాధారాయై నమః
ఓం 3 సర్వ గతాయై నమః
ఓం 3 సర్వావగుణ వర్జితాయై నమః
ఓం 3 సర్వారుణాయై నమః
ఓం 3 సర్వమాత్రే నమః
ఓం 3 సర్వభూషణ భూషితాయై నమః
ఓం 3 కకారార్థాయై నమః
ఓం 3 కాలహన్త్ర్యై నమః
ఓం 3 కామేశ్యై నమః
ఓం 3 కామితార్థదాయై నమః
ఓం 3 కామసంజీవిన్యై నమః
ఓం 3 కల్యాయై నమః
ఓం 3 కఠినస్తన మండలాయై నమః
ఓం 3 కరభోరవే నమః
ఓం 3 కలానాథముఖ్యై నమః
ఓం 3 కచజితాంబుదాయై నమః
ఓం 3 కటాక్షస్యన్దికరుణాయై నమః
ఓం 3 కపాలి ప్రాణనాయికాయై నమః

ఓం 3 కారుణ్యవిగ్రహాయై నమః
ఓం 3 కాంతాయై నమః
ఓం 3 కాంతి ధూతజపావల్యై నమః
ఓం 3 కలాలాపాయై నమః
ఓం 3 కంబు కంఠ్యై నమః
ఓం 3 కరనిర్జిత పల్లవాయై నమః
ఓం 3 కల్పవల్లీసమభుజాయై నమః
ఓం 3 కస్తూరీతిలకాంచితాయై నమః
ఓం 3 హకారార్థాయై నమః
ఓం 3 హంసగత్యై నమః
ఓం 3 హాటకాభరణోజ్జ్వలాయై నమః
ఓం 3 హారహారి కుచాభోగాయై నమః
ఓం 3 హాకిన్యై నమః
ఓం 3 హల్యవర్జితాయై నమః
ఓం 3 హరిత్పతి సమారాధ్యాయై నమః
ఓం 3 హఠాత్కార హతాసురాయై నమః
ఓం 3 హర్షప్రదాయై నమః
ఓం 3 హవిర్భోక్త్ర్యై నమః
ఓం 3 హార్దసంతమసాపహాయై నమః
ఓం 3 హల్లీహాలాస్య సంతుష్టాయై నమః
ఓం 3 హంసమంత్రార్థ రూపిణ్యై నమః
ఓం 3 హానోపాదాన నిర్ముక్తాయై నమః
ఓం 3 హర్షిణ్యై నమః
ఓం 3 హరిసోదర్యై నమః
ఓం 3 హాహా హూహూ -
- ముఖస్తుత్యాయై నమః
ఓం 3 హాని వృద్ధి వివర్జితాయై నమః
ఓం 3 హయ్యంగవీనహృదయాయై నమః
ఓం 3 హరిగోపారుణాంశుకాయై నమః

ఓం 3 లకారాఖ్యాయై నమః
ఓం 3 లతాపూజ్యాయై నమః
ఓం 3 లయస్థిత్యుద్భవేశ్వర్యై నమః
ఓం 3 లాస్యదర్శన సంతుష్టాయై నమః
ఓం 3 లాభాలాభవివర్జితాయై నమః
ఓం 3 లంఘ్యేతరాజ్ఞాయై నమః
ఓం 3 లావణ్యశాలిన్యై నమః
ఓం 3 లఘుసిద్ధిదాయై నమః
ఓం 3 లాక్షారస సవర్ణాభాయై నమః
ఓం 3 లక్ష్మణాగ్రజపూజితాయై నమః
ఓం 3 లభ్యేతరాయై నమః
ఓం 3 లబ్ధ భక్తిసులభాయై నమః
ఓం 3 లాంగలాయుధాయై నమః
ఓం 3 లగ్నచామరహస్త -
- శ్రీశారదాపరివీజితాయై నమః
ఓం 3 లజ్జాపద సమారాధ్యాయై నమః
ఓం 3 లంపటాయై నమః
ఓం 3 లకుళేశ్వర్యై నమః
ఓం 3 లబ్ధమానాయై నమః
ఓం 3 లబ్ధరసాయై నమః
ఓం 3 లబ్ధసంపత్సమున్నత్యై నమః
ఓం 3 హ్రీంకారిణ్యై నమః
ఓం 3 హ్రీంకారాద్యాయై నమః
ఓం 3 హ్రీంమధ్యాయై నమః
ఓం 3 హ్రీంశిఖామణయే నమః
ఓం 3 హ్రీంకార -
- కుండాగ్నిశిఖాయై నమః
ఓం 3 హ్రీంకార శశి చంద్రికాయై నమః
ఓం 3 హ్రీంకార భాస్కరరుచ్యై నమః

ఓం 3 హ్రీంకారాంభోద -
- చంచలాయై నమః
ఓం 3 హ్రీంకార -
- కందాంకురికాయై నమః
ఓం 3 హ్రీంకారైకపరాయణాయై నమః
ఓం 3 హ్రీంకార దీర్ఘికా హంస్యై నమః
ఓం 3 హ్రీంకారోద్యాన కేకిన్యై నమః
ఓం 3 హ్రీంకారారణ్య హరిణ్యై నమః
ఓం 3 హ్రీంకారావాల వల్లర్యై నమః
ఓం 3 హ్రీంకారపంజరశుక్యై నమః
ఓం 3 హ్రీంకారాంగణ దీపికాయై నమః
ఓం 3 హ్రీంకార కన్దరాసింహ్యై నమః
ఓం 3 హ్రీంకారాంభోజ -
- భృంగికాయై నమః
ఓం 3 హ్రీంకార సుమనోమాధ్వ్యై నమః
ఓం 3 హ్రీంకార తరుమంజర్యై నమః
220
ఓం 3 సకారాఖ్యాయై నమః
ఓం 3 సమరసాయై నమః
ఓం 3 సకలాగమ సంస్తుతాయై నమః
ఓం 3 సర్వవేదాంత -
- తాత్పర్యభూమ్యై నమః
ఓం 3 సదసదాశ్రయాయై నమః
ఓం 3 సకలాయై నమః
ఓం 3 సచ్చిదానందాయై నమః
ఓం 3 సాధ్యాయై నమః
ఓం 3 సద్గతిదాయిన్యై నమః
ఓం 3 సనకాదిమునిధ్యేయాయై నమః
ఓం 3 సదాశివకుటుంబిన్యై నమః

ఓం 3 సకలాధిష్ఠానరూపాయై నమః
ఓం 3 సత్యరూపాయై నమః
ఓం 3 సమాకృత్యై నమః
ఓం 3 సర్వప్రపంచ నిర్మాత్ర్యై నమః
ఓం 3 సమానాధిక వర్జితాయై నమః
ఓం 3 సర్వోత్తుఙ్గాయై నమః
ఓం 3 సఙ్గహీనాయై నమః
ఓం 3 సగుణాయై నమః
ఓం 3 సకలేష్టదాయై నమః
ఓం 3 కకారిణ్యై నమః
ఓం 3 కావ్యలోలాయై నమః
ఓం 3 కామేశ్వర మనోహరాయై నమః
ఓం 3 కామేశ్వర ప్రాణనాడ్యై నమః
ఓం 3 కామేశోత్సఙ్గవాసిన్యై నమః
ఓం 3 కామేశ్వరాలిఙ్గితాంగ్యై నమః
ఓం 3 కామేశ్వర సుఖప్రదాయై నమః
ఓం 3 కామేశ్వర ప్రణయిన్యై నమః
ఓం 3 కామేశ్వర విలాసిన్యై నమః
ఓం 3 కామేశ్వర తపస్సిద్ధ్యై నమః
ఓం 3 కామేశ్వర -
- మనఃప్రియాయై నమః
ఓం 3 కామేశ్వర ప్రాణనాడ్యై నమః
ఓం 3 కామేశ్వర విమోహిన్యై నమః
ఓం 3 కామేశ్వర బ్రహ్మవిద్యాయై నమః
ఓం 3 కామేశ్వర గృహేశ్వర్యై నమః
ఓం 3 కామేశ్వరాహ్లాదకర్యై నమః
ఓం 3 కామేశ్వర మహేశ్వర్యై నమః
ఓం 3 కామేశ్వర్యై నమః
ఓం 3 కామకోటి నిలయాయై నమః

ఓం 3 కాంక్షితార్థదాయై నమః
ఓం 3 లకారిణ్యై నమః
ఓం 3 లబ్ధ రూపాయై నమః
ఓం 3 లబ్ధధియే నమః
ఓం 3 లబ్ధవాంఛితాయై నమః
ఓం 3 లబ్ధమనోదూరాయై నమః
ఓం 3 లబ్ధాహంకారదుర్గమాయై నమః
ఓం 3 లబ్ధశక్త్యై నమః
ఓం 3 లబ్ధ దేహాయై నమః
ఓం 3 లబ్ధైశ్వర్య సమున్నత్యై నమః
ఓం 3 లబ్ధవృద్ధయే నమః
ఓం 3 లబ్ధలీలాయై నమః
ఓం 3 లబ్ధయౌవనశాలిన్యై నమః
ఓం 3 లబ్ధాతిశయ సర్వాంగ -
- సౌందర్యాయై నమః
ఓం 3 లబ్ధవిభ్రమాయై నమః
ఓం 3 లబ్ధరాగాయై నమః
ఓం 3 లబ్ధపత్యై నమః
ఓం 3 లబ్ధనానాగమస్థిత్యై నమః
ఓం 3 లబ్ధభోగాయై నమః
ఓం 3 లబ్ధ సుఖాయై నమః
ఓం 3 లబ్ధహర్షాభిపూరితాయై నమః
ఓం 3 హ్రీంకారమూర్తయే నమః
ఓం 3 హ్రీంకారసౌధశృంగ -
- కపోతికాయై నమః
ఓం 3 హ్రీంకార దుగ్ధాబ్ధి సుధాయై నమః
ఓం 3 హ్రీంకార కమలేందిరాయై నమః
ఓం 3 హ్రీంకార మణిదీపార్చిషే నమః
ఓం 3 హ్రీంకార తరుశారికాయై నమః
ఓం 3 హ్రీంకార పేటకమణయే నమః
ఓం 3 హ్రీంకారాదర్శ -
- బింబితాయై నమః
ఓం 3 హ్రీంకార కోశాసిలతాయై నమః
ఓం 3 హ్రీంకారాస్థాన నర్తక్యై నమః
ఓం 3 హ్రీంకార శుక్తికా -
- ముక్తామణయే నమః
ఓం 3 హ్రీంకార బోధితాయై నమః
ఓం 3 హ్రీంకార మయసౌవర్ణ -
- స్తంభవిద్రుమ పుత్రికాయై నమః
ఓం 3 హ్రీంకార వేదోపనిషదే నమః
ఓం 3 హ్రీంకారాధ్వర -
- దక్షిణాయై నమః
ఓం 3 హ్రీంకార నందనారామ -
- నవకల్పకవల్లర్యై నమః
ఓం 3 హ్రీంకార -
- హిమవద్గంగాయై నమః
ఓం 3 హ్రీంకారార్ణవ -
- కౌస్తుభాయై నమః
ఓం 3 హ్రీంకార -
- మంత్రసర్వస్వాయై నమః
ఓం 3 హ్రీంకార పరసౌఖ్యదాయై నమః
300
ఓం 3 శ్రీమద్రాజ -
- రాజేశ్వర్యైనమో నమః

ఇతి శ్రీదేవీ త్రిశతీనామావళిః సంపూర్ణమ్.

★★★

శ్రీః

# శ్రీదేవీ కవచ నామావళిః ॥

ఓం శ్రీమహాత్రిపుర సుందర్యై నమః ।
ఓం మమ అభిముఖే - జయాయై నమః ।
ఓం మమ పృష్ఠే - విజయాయై నమః ।
ఓం మమ వామ పార్శ్వే - అజితాయై నమః ।
ఓం మమ దక్ష పార్శ్వే - అపరాజితాయై నమః ।
ఓం మమ శిఖే - ద్యోతిన్యై నమః ।
ఓం మమ మూర్ధ్ని - ఉమాయై నమః ।
ఓం మమ లలాటే - మాల ధారిణ్యై నమః ।
ఓం మమ భ్రువౌ - యశస్విన్యై నమః ।
ఓం మమ నేత్రద్వయే - శంఖిన్యై నమః ।
ఓం మమ కర్ణే - ద్వార వాసిన్యై నమః ।
ఓం మమ కపోలే - కాలికాయై నమః ।
ఓం మమ కర్ణమూలే - శాంకర్యై నమః ।
ఓం మమ నాసికాయాం - సుగంధిన్యై నమః ।
ఓం మమ ఉత్తరోష్ఠే - చర్చికాయై నమః ।
ఓం మమ అధరోష్ఠే - అమృతకలాయై నమః ।
ఓం మమ జిహ్వా - సరస్వత్యై నమః ।
ఓం మమ దన్తే - కుమారిణ్యై నమః ।
ఓం మమ కంఠే - మహాచణ్డికాయై నమః ।
ఓం మమ కంఠమణౌ - చిత్ర ఘంటాయై నమః ।
ఓం మమ తాలుకే - మహామాయాయై నమః ।
ఓం మమ చుబుకే - కామాక్షిణ్యై నమః ।
ఓం మమ వచనే - సర్వమంగళాయై నమః ।

ఓం మమ గ్రీవాయాం - భద్రకాళిన్యై నమః ।
ఓం మమ పృష్ఠదండే - ధనుర్ధర్యై నమః ।
ఓం మమ స్కంధే - ఖడ్గధారిణ్యై నమః ।
ఓం మమ బాహ్వోః - వజ్రధారిణ్యై నమః ।
ఓం మమ హస్తయోః - దణ్డిన్యై నమః ।
ఓం మమ హస్తాంగులీషు - అంబికాయై నమః ।
ఓం మమ హస్తాంగుష్ఠే - గౌర్యై నమః ।
ఓం మమ తర్జన్యోః - కాళ్యై నమః ।
ఓం మమ మధ్యమయోః - మహామాయాయై నమః ।
ఓం మమ అనామిక్యోః - సురేశ్వర్యై నమః ।
ఓం మమ కనిష్ఠికయోః - చాముండాయై నమః ।
ఓం మమ కరతల కరపృష్ఠాభ్యాం - కాలికాయై నమః ।
ఓం మమ హస్త నఖేషు - శూలేశ్వర్యై నమః ।
ఓం మమ ఉభయ బాహుమూలే - నలేశ్వర్యై నమః ।
ఓం మమ స్తనౌ - మహాదేవ్యై నమః ।
ఓం మమ హృదయే - లలితాయై నమః ।
ఓం మమ ఉదరే - శూలిన్యై నమః ।
ఓం మమ నాభౌ - పూర్ణకామిన్యై నమః ।
ఓం మమ గుహ్యే - గుహ్యేశ్వర్యై నమః ।
ఓం మమ ఉపస్థే - భూతనాథాయై నమః ।
ఓం మమ ఊరుభ్యాం - మేఘ వాహిన్యై నమః ।
ఓం మమ కట్యాం - భగవత్యై నమః ।
ఓం మమ ఊరు పర్వణోః - వింధ్యవాసిన్యై నమః ।
ఓం మమ జంఘే (జాన్వధోభాగే) సర్వకామప్రదా మహాబలాయై నమః ।
ఓం మమ గుల్ఫౌ - నారసింహ్యై నమః ।
ఓం మమ పాదపృష్ఠే (పాదయోర్వ్యుపరితలే) - అమితద్యుతిదేవ్యై నమః ।
ఓం మమ పాదాంగులీషు - శ్రీధర్యై నమః ।

ఓం మమ పాదతలే (అధోభాగే) - తల (పాతాళ) వాసిన్యై నమః ।
ఓం మమ పాదనఖేషు - దంష్ట్రా కరాలిన్యై నమః ।
ఓం మమ శిరోరుహేషు - ఉర్ధ్వ కేశిన్యై నమః ।
ఓం మమ రోమకూపేషు - కౌబేర్యై నమః ।
ఓం మమ శరీర చర్మే - త్వగీశ్వర్యై నమః ।
ఓం మమ రక్తాది ధాతు చతుష్టయేషు, మమ అస్థ్వాది ధాతుద్వయేషు, శ్రీపార్వత్యై నమః ।
ఓం మమ కోష్ఠ గతాన్యాహార, నిగరణోద్గీరణాది సాధనేషు, మాంసమయునలకేషు, కాలరాత్ర్యై నమః ।
ఓం మమ పిత్తదోషే - ముకుటేశ్వర్యై నమః ।
ఓం మమ వాతదోషే - పద్మావత్యై నమః ।
ఓం మమ కఫ దోషే - చూడామణ్యై నమః ।
ఓం మమ హవిర్భక్షణ సాధనే - జ్వాలాముఖిన్యై నమః ।
ఓం మమ సర్వసంధిషు - అభేద్యాయై నమః ।
ఓం మమ శుక్రరక్షణే - బ్రహ్మచారిణ్యై నమః ।
ఓం మమ శరీర కాంతి రక్షణే - ఛత్రేశ్వర్యై నమః ।
ఓం మమ ధర్మ సంస్థాపనేషు, అహంకారాది త్రయేషు, ప్రాణాది పంచకేషు, ధర్మచారిణ్యై నమః ।
ఓం మమ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధేషు, జీవాత్మ, పరమాత్మ ఏకీభావన సాధనేషు, యోగిన్యై నమః ।
ఓం మమ సత్వాది గుణత్రయేషు - నారాయణ్యై నమః ।
ఓం మమ ఆయుఃపాలనేషు - వారాహ్యై నమః ।
ఓం మమ వర్ణాశ్రమాచార ధర్మరక్షణేషు - వైష్ణవ్యై నమః ।
ఓం మమ యశో, కీర్తి, లక్ష్మీ రక్షణేషు - సప్తమాత్రే నమః ।
ఓం మమ గోత్ర (కుల) రక్షణేషు - ఇంద్రాణ్యై నమః ।
ఓం మమ పశు రక్షణేషు - చండికాయై నమః ।
ఓం మమ పుత్ర రక్షణేషు - మహాలక్ష్మ్యై నమః ।

ఓం మమ భార్య రక్షణేషు - భైరవ్యై నమః ।
ఓం మమ ధన సంచయ రక్షణేషు - ధనేశ్వర్యై నమః ।
ఓం మమ పుత్రీ రక్షణేషు - కుమార్యై నమః ।
ఓం మమ మార్గ రక్షణే - క్షేమకర్యై నమః ।
ఓం మమ సర్వత్ర రక్షణే - విజయాయై నమః ।
ఓం మమ పాపశమనార్థం - హస్తినాపుర్యై నమః ।
ఓం బ్రహ్మణశ్శక్తిః, హంసవాహినీ, బ్రాహ్మ్యై నమః ।
ఓం మహేశ్వర శ్శక్తిః, వృషభారూఢా - మాహేశ్వర్యై నమః ।
ఓం కుమారస్య శక్తిః, మయూర వాహినీ - కౌమార్యై నమః ।
ఓం విష్ణోశ్శక్తిః, గరుడాసనీ, వైష్ణవ్యై నమః ।
ఓం యమస్యశక్తిః, వరాహరూపధారిణీ, వారాహ్యై నమః ।
ఓం ఇంద్రస్యశక్తిః, ఐరావతారూఢా - ఇంద్రాణ్యై నమః ।
ఓం చండ, ముండ, హస్త్రీ - చాముండాయై నమః ।
ఓం హిమాచలస్య పుత్రీ - శైలపుత్ర్యై నమః ।
ఓం బ్రహ్మతపశ్చారిణీ - బ్రహ్మచారిణ్యై నమః ।
ఓం ఆహ్లాదకారిణీ - చంద్రఘంటాయై నమః ।
ఓం కూష్మాండ ప్రియా - కూష్మాండాయై నమః ।
ఓం స్కందస్యమాతా - స్కందమాతాయై నమః ।
ఓం కతముర్యాశ్రమే ప్రాదుర్భూతా - కాత్యాయన్యై నమః ।
ఓం కాలస్య రాత్రిః - కాలరాత్ర్యై నమః ।
ఓం అతిశ్వేతవర్ణా - మహాగౌర్యై నమః ।
ఓం అష్ట సిద్ధిదాత్రీ - సిద్ధిదాయై నమః ।
ఓం సర్వదేవతా స్వరూపిణీ నవదుర్గాయై నమః ।

ఓం శాంతిః

ఇతి శ్రీదేవీ కవచ నామావళిః ॥



శ్రీః

# శ్రీ దేవీ జయమాలా

హ్రీంకారాసన గర్భితానలశిఖాం సౌః క్లీం కళాబిభ్రతీమ్।
సౌవర్ణాంబరధారిణీం వరసుధాధౌతాం త్రినేత్రోజ్జ్వలామ్ ।
వందే పుస్తక పాశమంకుశధరాం స్రగ్భూషితాముజ్జ్వలామ్ ।
త్వాం గౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్ర సంచారిణీమ్ ॥

ఓం ఐం హ్రీం శ్రీం త్రిపురసుందరి జయ జయ ।
ఓం 3 హృదయదేవి జయ జయ। ఓం 3 శిరోదేవి జయ జయ ।
ఓం 3 శిఖాదేవి జయ జయ । ఓం 3 కవచదేవి జయ జయ ।
ఓం 3 నేత్రదేవి జయ జయ । ఓం 3 అస్త్రదేవి జయ జయ ।
ఓం 3 కామేశ్వరి జయ జయ । ఓం 3 భగమాలిని జయ జయ ।
ఓం 3 నిత్యక్లిన్నే జయ జయ । ఓం 3 భేరుండే జయ జయ ।
ఓం 3 వహ్నివాసిని జయ జయ । ఓం 3 మహావజ్రేశ్వరి జయ జయ ।
ఓం 3 శివదూతి జయ జయ । ఓం 3 త్వరితే జయ జయ ।
ఓం 3 కులసుందరి జయ జయ । ఓం 3 నిత్యే జయ జయ ।
ఓం 3 నీలపతాకే జయ జయ । ఓం 3 విజయే జయ జయ ।
ఓం 3 సర్వమంగళే జయ జయ । ఓం 3 జ్వాలామాలిని జయ జయ ।
ఓం 3 విచిత్రే జయ జయ । ఓం 3 శ్రీవిద్యే జయ జయ ।
ఓం 3 దక్షిణామూర్తిమయి జయ జయ। ఓం 3 నారాయణమయి జయ జయ॥
ఓం 3 బ్రహ్మమయి జయ జయ । ఓం 3 సనకమయి జయ జయ ।
ఓం 3 సనందనమయి జయ జయ । ఓం 3 సనాతనమయి జయ జయ ।
ఓం 3 సనత్కుమారమయి జయ జయ । ఓం 3 సనత్సుజాతమయి జయ జయ॥
ఓం 3 వసిష్ఠమయి జయ జయ । ఓం 3 శక్తిమయి జయ జయ ।
ఓం 3 పరాశరమయి జయ జయ । ఓం 3 కృష్ణద్వైపాయనమయి జయ జయ।
ఓం 3 పైలమయి జయ జయ । ఓం 3 వైశంపాయనమయి జయ జయ।
ఓం 3 జైమినిమయి జయ జయ । ఓం 3 సుమంతుమయి జయ జయ ।
ఓం 3 శ్రీశుకమయి జయ జయ । ఓం 3 గౌడపాదమయి జయ జయ।
ఓం 3 గోవిందమయి జయ జయ । ఓం 3 శ్రీవిద్యాశంకరమయి జయ జయ।

ఓం 3 పద్మపాదమయి జయ జయ। ఓం 3 హస్తామలకమయి జయ జయ।
ఓం 3 త్రోటకమయి జయ జయ । ఓం 3 సురేశ్వరమయి జయ జయ ।
ఓం 3 విద్యారణ్యమయి జయ జయ ।
ఓం 3 మహాదేవానందనాథమయి జయ జయ ।
ఓం 3 కరాళాంజనేయానందనాథమయి జయ జయ ।
ఓం 3 జగన్మోహనానందనాథమయి జయ జయ ।
ఓం 3 గోపానందనాథమయి జయ జయ ।
I. ఓం 3 త్రైలోక్యమోహన చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 ప్రకటయోగిని జయ జయ । ఓం 3 అణిమాసిద్ధే జయ జయ ।
ఓం 3 లఘిమాసిద్ధే జయ జయ । ఓం 3 మహిమాసిద్ధే జయ జయ ।
ఓం 3 ఈశిత్వసిద్ధే జయ జయ । ఓం 3 వశిత్వసిద్ధే జయ జయ ।
ఓం 3 ప్రాకామ్యసిద్ధే జయ జయ । ఓం 3 భుక్తిసిద్ధే జయ జయ ।
ఓం 3 ఇచ్ఛాసిద్ధే జయ జయ । ఓం 3 ప్రాప్తిసిద్ధే జయ జయ ।
ఓం 3 సర్వకామసిద్ధే జయ జయ । ఓం 3 బ్రాహ్మి జయ జయ ।
ఓం 3 మాహేశ్వరి జయ జయ । ఓం 3 కౌమారి జయ జయ ।
ఓం 3 వైష్ణవి జయ జయ । ఓం 3 వారాహి జయ జయ ।
ఓం 3 మాహేంద్రి జయ జయ । ఓం 3 చాముండే జయ జయ ।
ఓం 3 మహాలక్ష్మి జయ జయ । ఓం 3 సర్వసంక్షోభిణి జయ జయ ।
ఓం 3 సర్వవిద్రావిణి జయ జయ । ఓం 3 సర్వాకర్షిణి జయ జయ ।
ఓం 3 సర్వవశంకరి జయ జయ । ఓం 3 సర్వోన్మాదిని జయ జయ ।
ఓం 3 సర్వమహాంకుశే జయ జయ । ఓం 3 సర్వఖేచరి జయ జయ ।
ఓం 3 సర్వబీజే జయ జయ। ఓం 3 సర్వయోనే జయ జయ ।
ఓం 3 సర్వత్రిఖండే జయ జయ । ఓం 3 త్రిపురే జయ జయ ।
II. ఓం 3 సర్వాశాపరిపూరకచక్రస్వామిని జయ జయ ।
ఓం 3 గుప్తయోగిని జయ జయ । ఓం 3 కామాకర్షిణి జయ జయ ।
ఓం 3 బుద్ధ్యాకర్షిణి జయ జయ । ఓం 3 అహంకారాకర్షిణి జయ జయ ।
ఓం 3 శబ్దాకర్షిణి జయ జయ । ఓం 3 స్పర్శాకర్షిణి జయ జయ ।
ఓం 3 రూపాకర్షిణి జయ జయ । ఓం 3 రసాకర్షిణి జయ జయ ।
ఓం 3 గంధాకర్షిణి జయ జయ । ఓం 3 చిత్తాకర్షిణి జయ జయ ।
ఓం 3 ధైర్యాకర్షిణి జయ జయ । ఓం 3 స్మృత్యాకర్షిణి జయ జయ ।

ఓం 3 నామాకర్షిణి జయ జయ । ఓం 3 బీజాకర్షిణి జయ జయ ।
ఓం 3 ఆత్మాకర్షిణి జయ జయ । ఓం 3 అమృతాకర్షిణి జయ జయ ।
ఓం 3 శరీరాకర్షిణి జయ జయ । ఓం 3 త్రిపురేశి జయ జయ ।
III. ఓం 3 సర్వసంక్షోభణ చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 గుప్తతర యోగిని జయ జయ । ఓం 3 అనంగ కుసుమే జయ జయ ।
ఓం 3 అనంగ మేఖలే జయ జయ । ఓం 3 అనంగ మదనే జయ జయ ।
ఓం 3 అనంగమదనాతురే జయ జయ । ఓం 3 అనంగరేఖే జయ జయ ।
ఓం 3 అనంగ వేగిని జయ జయ । ఓం 3 అనంగాంకుశే జయ జయ ।
ఓం 3 అనంగమాలిని జయ జయ । ఓం 3 త్రిపురసుందరి జయ జయ ॥
IV. ఓం 3 సర్వసౌభాగ్యదాయక చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 సంప్రదాయ యోగిని జయ జయ। ఓం 3 సర్వసంక్షోభిణి జయ జయ।
ఓం 3 సర్వ విద్రావిణి జయ జయ । ఓం 3 సర్వాకర్షిణి జయ జయ ।
ఓం 3 సర్వాహ్లాదిని జయ జయ । ఓం 3 సర్వ సంమోహిని జయ జయ ।
ఓం 3 సర్వ స్తంభిని జయ జయ । ఓం 3 సర్వ జృంభిణి జయ జయ ।
ఓం 3 సర్వ వశంకరి జయ జయ । ఓం 3 సర్వ రంజని జయ జయ ।
ఓం 3 సర్వోన్మాదిని జయ జయ । ఓం 3 సర్వార్థ సాధని జయ జయ ।
ఓం 3 సర్వ సంపత్తి పూరణి జయ జయ ।
ఓం 3 సర్వ మంత్రమయి జయ జయ ।
ఓం 3 సర్వ ద్వంద్వ క్షయంకరి జయ జయ ।
ఓం 3 త్రిపుర వాసిని జయ జయ ।
V. ఓం 3 సర్వార్థసాధక చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 కుల యోగిని జయ జయ । ఓం 3 సర్వసిద్ధిప్రదే జయ జయ ।
ఓం 3 సర్వ సంపత్ప్రదే జయ జయ । ఓం 3 సర్వ ప్రియంకరి జయ జయ ।
ఓం 3 సర్వ మంగళకారిణి జయ జయ ।
ఓం 3 సర్వ కామప్రదే జయ జయ ।
ఓం 3 సర్వ దుఃఖ విమోచని జయ జయ ।
ఓం 3 సర్వ మృత్యుప్రశమని జయ జయ ।
ఓం 3 సర్వవిఘ్న నివారిణి జయ జయ । ఓం 3 సర్వాంగసుందరి జయ జయ
ఓం 3 సర్వసౌభాగ్యదాయిని జయ జయ । ఓం 3 త్రిపురాశ్రీ జయ జయ ।
VI. ఓం 3 సర్వ రక్షాకర చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 నిగర్భ యోగిని జయ జయ । ఓం 3 సర్వజ్ఞే జయ జయ ।

ఓం 3 సర్వశక్తే జయ జయ । ఓం 3 సర్వైశ్వర్య ప్రదాయిని జయ జయ ।
ఓం 3 సర్వ జ్ఞానమయి జయ జయ । ఓం 3 సర్వ వ్యాధి వినాశిని జయ జయ।
ఓం 3 సర్వాధార స్వరూపే జయ జయ । ఓం 3 సర్వ పాపహరే జయ జయ ।
ఓం 3 సర్వానందమయి జయ జయ । ఓం 3 సర్వరక్షాస్వరూపిణి జయ జయ।
ఓం 3 సర్వేప్సితార్థప్రదే జయ జయ । ఓం 3 త్రిపుర మాలిని జయ జయ ।
VII. ఓం 3 సర్వరోగహర చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 రహస్య యోగిని జయ జయ । ఓం 3 వశిని జయ జయ ।
ఓం 3 కామేశ్వరి జయ జయ । ఓం 3 మోదిని జయ జయ ।
ఓం 3 విమలే జయ జయ । ఓం 3 అరుణే జయ జయ ।
ఓం 3 జయిని జయ జయ । ఓం 3 సర్వేశ్వరి జయ జయ ।
ఓం 3 కౌళిని జయ జయ । ఓం 3 త్రిపురాసిద్ధే జయ జయ ।
VIII. ఓం 3 సర్వసిద్ధిప్రద చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 అతిరహస్య యోగిని జయ జయ ।
ఓం 3 బాణిని జయ జయ । ఓం 3 చాపిని జయ జయ ।
ఓం 3 పాశిని జయ జయ । ఓం 3 అంకుశిని జయ జయ ।
ఓం 3 మహాకామేశ్వరి జయ జయ । ఓం 3 మహావజ్రేశ్వరి జయ జయ ।
ఓం 3 మహాభగమాలిని జయ జయ । ఓం 3 త్రిపురాంబికే జయ జయ ।
IX. ఓం 3 సర్వానందమయ చక్రస్వామిని జయ జయ ।
ఓం 3 పరాపర రహస్య యోగిని జయ జయ ।
ఓం 3 మహా మహాకామేశ్వరి జయ జయ ।
ఓం 3 మహా మహా శ్రీచక్రనగర సామ్రాజ్ఞి జయ జయ ।
ఓం 3 మహా రాజరాజేశ్వరి జయ జయ ।
ఓం 3 పరబ్రహ్మ స్వరూపిణి జయ జయ ।

శ్రీంహ్రీంఐం నమస్తే నమస్తే నమస్తే నమః ॥

ఇతి శ్రీదేవీ జయమాలా ..

శ్రీచండి నవశతి మంత్రమాలా మంత్రమును నమోంతము,
తర్పణాంతము, స్వాహాంతము, జయాంతముగా పఠించువారికి
శ్రీదేవీకటాక్షము పరిపూర్ణముగా కలుగుట నిశ్చయము.

శ్రీః శ్రీః శ్రీః

★★★

శ్రీః

# శ్రీదేవీ మాహాత్మ్యము

# శ్రీ చండీ నవశతి ప్రశంస

సప్తశతికి స్వస్తి

**GIVE UP FEAR ALL**

**KNOW YOUR REAL MOTHER**



సదాచార ప్రవర్తిని

దురాచార విఘాతిని

శ్రీ చండీ నవశతి మంత్రమాల


శ్రీ గోపానందనాథులు

ప్రచారకులు

శ్రీరామ

# శ్రీదేవీమాహాత్మ్యము - చండీ నవశతి.

ఇప్పటికి అరవై ఏడు వత్సరాల క్రితము దివ్యపురుషులైన నా గురువర్యులు దేవీ ఆరాధనా విధానమును, చండీ సప్తశతిని సంస్కరించమని ఆదేశించారు - వారి ఆజ్ఞానుసారముగా చేసిన కృషి లో నవచక్రాధీశ్వరికి నవరాత్రముల లో నవకోణములు, నవావరణల తో చేసే పూజల లో, సప్తశతికి బదులుగా నవాంగ సహిత నవశతి యుండినట్లు గోచరించింది.

అప్పటి నుండి చండీ నవశతి కొరకు గా దేశము లోని పలు ప్రాంతాలను సందర్శించాను. చివరగా కరవీర పీఠాధిపతులు, వ్యాకరణవేత్త, బహుశ్రుతి, స్మృతి, పురాణజ్ఞులు అయిన శ్రీశ్రీశ్రీ విద్యానృసింహభారతీస్వామి వారి "శ్రీ చండీకోపాస్తి దీపికా" గ్రంథములో తగిన ప్రమాణములు లభ్యపడినవి. వాని ఆధారముగా "శ్రీచండీ నవశతి మంత్రమాల" సత్సంప్రదాయ పరముగా ఉద్ధరించి ఇప్పటికి మూడు దశాబ్దాలు దాటింది. ఈ బృహత్కార్యములో బహుళ ప్రచారము లో వున్న సప్తశతి లోని లోపాలు సవరింపబడినవి. ఈ పరిష్కరణకు చేయూత నిచ్చిన కీర్తిశేషులు శ్రీగొరిపెద్ది రామసుబ్బశర్మ చిరస్మరణీయులు.

శ్రీ మార్కండేయ మహా పురాణాంతర్గత మైన "శ్రీదేవీమాహాత్మ్యము" లో చండి అనగా ఆదిపరాశక్తి, అఖండ బ్రహ్మవిద్య అని ప్రబోధించ బడింది. అందలి శ్లోకాలే చండీ నవశతికి మాతృక.

సప్తశతి పూర్వ స్వరూపము నవశతి అని, అదిసాధకునకు చాల బరువుగా వున్నట్లు బ్రహ్మగ్రహించి, దానిని ఉద్ధరించమని ఆయన ఈశ్వరుని

ప్రార్థించగా, ఈశ్వరుడు నవశతిని సముద్ధరించి సప్తశతి గా చేసినట్లు కాత్యాయన్యాది తంత్రాలలో పేర్కొన బడింది. ''పురాకల్పే ఇదం దేవీ మాహాత్మ్యమ్ నవశత శ్లోకాత్మకత్వా నవశతి సంజ్ఞమాసీత్'' అనుట వలన అది పద్మకల్పమో బ్రహ్మకల్పమో, శ్వేతవరాహకల్పమో ఊహింప లేము. వామకేశ్వర తంత్రము లో--

నవార్ణా నవచండీ చ నవావరణ దేవతాః ।
నవశ్లోక శతాన్యేవం ద్వితయం నవరాత్ర యోః ॥
ఏ త ద్గోప్య తమం సర్వం న దేయం యస్య కస్య చిత్ ।
రాజ్యం దేయం శిరోదేయం దేయా నవశతీ న చ ॥

అని వున్నందున సత్సంప్రదాయ పరముగా నవశతి ఆరాధింప బడుతుండినట్లు గా తెలుస్తున్నది.

ఈ నాడు చండీ సప్తశతి పారాయణ, హోమాదులు శాంతి పేరిట నిర్వర్తిస్తున్నారు - కాని చండీ అనగానే ఆమె ప్రత్యేక క్రూర తామసీశక్తి, రాజరాజేశ్వరి కన్నా విభిన్నమైనది, అమెను తాంత్రిక పరముగా మద్య, మాంసాదుల తోనే అర్చించాలి అనే దుర్భావన ప్రబలి యున్నది.

ఈ దుర్భావనకు, చండీ అనగానే కలిగే మహాభీతికి కారణము గ్రహించేందుకు సప్తశతి విధానము గురించి పరిశీలిస్తే గాని తెలియదు.

చండీ యాగాలు చేసేవారికి, చేయించే వారికి, చూసేవారికి, చండీ అంటే భయపడే వారికి, ఈ పరిశీలన మరియు సప్తశతి గురించిన అవగాహన వుండటము శ్రేయస్కరము - దానికి ముందుగా ఈ క్రింది విషయములు గ్రహించాలి

1. చండీ నవార్ణ మంత్రార్థము. ఆమెను బ్రహ్మవిద్య గా తెలుపు తున్నది.

2. నవ సంఖ్య పూర్ణ సంఖ్య. దీనిని మించిన సంఖ్యలేదు. పరిపూర్ణ పరబ్రహ్మమునకు అది సంకేతము.

3. అతి ప్రాచీనమైన నవశతిని తాంత్రికులు సప్తశతి గా తమ మత ప్రచారానికై మార్చారు.

4. మూల పురాణములో సప్తశతి అనే పదము గాని, ఆ విధానము గురించి గాని ఎక్కడా ప్రస్తావించ లేదు. అలాగే ''ఋషిరువాచ'' ఇత్యాది ''ఉవాచ'' లను శ్లోక సంఖ్య గా లెక్కించలేదు.

5. శాస్త్రానుసారము గా సప్తశతి లో మంత్ర విభాగము జరుగ లేదు - ఏడువందల (సప్తశతి) మంత్రములు లేనిది సప్తశతి.

6. సప్త సంఖ్య పూర్ణ సంఖ్య కాదు. సప్త చక్రములపైన మరి రెండు చక్రములున్నవి. అవి గురుముఖతః నే గ్రహించాలి.

7. సప్తశతి కి ప్రత్యేక మంత్రము గాని, ఉపదేశప్రక్రియ గాని లేవు. నవార్ణ మంత్రమే మూలము. కాబట్టి సప్తశతి పరంపరాగతము కాదు.

నవశతిని సప్తశతి గా మార్చినందు వలన, సప్తశతిని పలు పేర్లతో, పాఠభేదములతో, పలుమార్పులతో ప్రకటిస్తున్నందు వలన, పరంపర పేరు తో సప్తశతి ని సమర్థించుట యుక్తముగాదు.

8. సప్తశతి కి అంగమైన ''రహస్యత్రయము'' తాంత్రికము. అది ''ఖిల మార్కండేయము'' లోనిది అన్నది తాంత్రిక కల్పన.

సప్తశతి కి భాస్కరరాయని ''గుప్తవతీ వ్యాఖ్యానము'' అనే తాంత్రిక గ్రంథము ప్రమాణము. అందులో దేవి క్రూర తామసీ శక్తి, అమెను రక్తతర్పణ, పశుబలుల తోనే ఆరాధించాలని వున్నది.

వేదము ప్రమాణముగా జీవించే బ్రాహ్మణులకు ఈ తాంత్రిక పూజలు నిషిద్ధములు - ఆ విధానము వారికి అన్వయము కానిదైనా, కులాచార స్తుతి చేస్తూవారు యాగాదులు నిర్వర్తిస్తున్నారు.

పవిత్రమైన ఈ విధానము లో తాంత్రికత ఎందుకు చోటు చేసుకున్నది? మహదాశయము తో చేసే దేవీ ఆరాధన లో లోపాలున్నాయని తెలిసి నపుడు వానిని సవరించు కొనుట ఉత్తమ మార్గము-

శ్లో॥ హంసస్సారం యథా దత్తే సారాసార వివేకతః।
త్యక్త్వాను సారం తథాసార మంజ్ఞీ కురతపండితః॥

శ్రీ చండీ నవశతి ప్రశంస

సప్తశతి ని గురించి తెలిసి కొనే ముందు ఈ క్రింది ప్రధాన విషయము లు కూడ తెలిసి కొనవలసిన అగత్యమున్నది.

శ్రుతి, స్మృతి, పురాణ ప్రబోధకమై, జ్ఞానము, భక్తి, శుచి, శ్రద్ధ, అహింసలు సోపానాలు గా నియమము లను పాటిస్తూ, శరీరము, మనస్సుల ను నిగ్రహించి, జప, ధ్యాన, యోగ క్రియల తో- అంతర్ముఖము గాను, పత్ర, పుష్ప, ఫలాదుల తో బాహ్యము గాను, సదాచారము తో జరిపే భగవదారాధన వైదిక సంప్రదాయ పరమైనది. దీని ధ్యేయము జన్మరాహిత్యము - దీనికి మార్గదర్శి సద్గురువు -

"త్రిక" సంప్రదాయము పేరు తో కాశ్మీరము లో పుట్టిన దే తాంత్రిక మతము - సదాచార విరుద్ధమైన దీని గురించి ఈ క్రింది గ్రంథాలు తెలుపు తున్నవి.

1. కౌళిక కల్పసూత్రము 2. గుప్తవతీ వ్యాఖ్యానము

3. సేతు బంధము 4. సౌభాగ్య భాస్కరము

5. కౌళోపనిషద్భాష్యము 6. రత్నా లోకము

7. నిత్యోత్సవము 8. కౌళావళీ నిర్ణయము-

ఇంక ను చాల గలవు- ఇందు మొదటి దైన కల్పసూత్రము ను శ్రీమహావిష్ణువు యొక్క దశావతారముల లోని వాడైన పరశురాముడు వ్రాసినట్లు తాంత్రికుల ప్రచారము. సాధుజన సంరక్షణ కొరకు, దుష్టశిక్షణకు అవతరించే శ్రీ మహావిష్ణువు తాంత్రిక మత ప్రబోధన, చేసినట్లు గా వారు చేసే ప్రచారము విజ్ఞులు నమ్మరానిది. ఇది కట్టు కథ.

వారి సిద్ధాంతము లోని విశేషములివి.

1. ఆనందో బ్రహ్మణో రూపం। తచ్చదేహే వ్యవస్థితం। తస్యాభి వ్యంజకాః పంచ 'మ' కారాః। తైరర్చనం గుప్త్యా ప్రాకట్యాన్నిరయః। --

మద్యము, మాంసము, మత్స్యము, ముద్ర, మంగువ లు పంచమకారాలు. వీనిని పూజా ద్రవ్యాలు గా జేసి, నిత్య, కామ్యోత్సవముల పేరుతో ఉన్మత్త భైరవానందము పొందాలి.

2. నరబలి, గో, బ్రాహ్మణ, శిశు హత్యలు విధిగా చెయ్యాలి.

3. వావి, వరుసలు చూడరాదనే నగ్న స్త్రీ యోని పూజలు-మైధునానంతరము శుక్ర, శ్రోణిత మిశ్రద్రవ్యమునకు కస్తూర్యాదులు చేర్చి, పూజావిధిలో విశేషార్ఘ్య పాత్రలో వుంచి, దానితో గురు, దేవతా పూజలు-దానినే మరల తీర్థ ప్రసాదముగా గురువుకు అర్పించి, అంతాస్వీకరించాలి.

4. కుండోద్భవము, గోళోద్భవము ల పేరు తో రజస్వలా స్త్రీ ఋతు స్రావము సేకరించి, ''కులపుష్పము, ''స్వయం భూ కుసుమము'' పేరుతో గురు, దేవతా పూజలు - దానినే ఘుటిక జేసి నిత్యపూజలో ముద్రగా వాడుట.

5. ఆకాశగమనము, ఖడ్గసిద్ధి - అంటూ అనేక సిద్ధుల కోసము అర్ధరాత్రి శ్మశానము లో శవపూజలు, శవాసనము పైన జప పురశ్చరణలు.

6. ఈ తంతులన్నీ రహస్యంగా చెయ్యాలి. తాంత్రిక గ్రంథాల ను రహస్యంగా దాచాలి.

7. తాంత్రిక పూజలు నిందించేవారు తల్లిదండ్రులైనా, అన్న దమ్ములైనా, వారిని హతమార్చాలి -

ఈ కులాచారము గురించి ఇంకా అనేక మున్నాయి-

కష్టించి చతుర్వేదములు చదివిన వారైనా ఈ కుల జ్ఞానము తెలియక పోతే అతడు నికృష్టుడు. అదే కుల జ్ఞాని సర్వశ్రేష్టుడు అని వారి గ్రంథాలు బోధిస్తున్నవి. అంతే గాక కౌళము కన్న ప్రశస్తమేదీ లేదంటున్నారు ఇలా-

శ్లో॥ సర్వే భ్య శ్చోత్తమా వేదా, వేదేభ్యో వైష్ణవం పరం।
వైష్ణవా దుత్తమం శైవం, శైవా ద్దక్షిణ ముత్తమం।
దక్షిణా దుత్తమం వామం, వామాత్సిద్ధాంత ముత్తమం।
సిద్ధాంతా దుత్తమం కౌళం, కౌళాత్పర తరం నహి॥

తాంత్రికులు కౌళులని, క్షపణకులని, కాపాలికులని, శాక్తేయులని, గాణాపత్యులని, సౌరులని - ఇలా అనేక పేర్లతో ఉన్నారు-

కౌళాః ఆధార పూజా నిరతాః।
క్షపణకాః యోని పూజా రతాః।
కాపాలికాః దిగంబరశ్చోభయత్ర రతాః।

శాక్తము లోని సురాపానము, గాణాపత్యము లోని మాంస భక్షణ, సౌరమతము లోని రక్తతర్పణ, భైరవ మతము లోని కపాల ధారణ - పేరుకు ఏదైనా అన్నీ దురాచార పూరితము లైన దుర్మతములే -

అవినీతి, హింస, పరమ జుగుప్సాకర చేష్టలున్నందు వలన ఈ దుర్మతములన్నీ అవైదికములని ఏనాడో నిషేధించారు శిష్టులు- ఎన్ని నిషేధాలున్నా ఉత్తర భారతం లో మాత్రము తాంత్రికులదే రాజ్యము - దక్షిణ భారతం లోను ఈ పూజలు రహస్యంగా జరిపే వారున్నారు. బ్రాహ్మణులై వుండి కూడ కొందరు ''తమ తాత ముత్తాతలు శ్రీచక్రార్చన లో మద్య మాంసాదు లుపయోగించే వారు- తాము కూడ అలా ఆచరిస్తే తప్పేమి'' అని అడుగుతున్నారు. సత్సంప్రదాయము గురించి పైన తెలిపాను. దానిని విసర్జించిన వారు గౌతమ శాపదగ్ధులు.

ఈ సత్సంప్రదాయము తమ మత వ్యాప్తికి చాల అవరోధము గా వున్నది, తమ చర్యల ను నిషేధిస్తున్నది అని గ్రహించిన తాంత్రికులు ఒక బృహత్పుథకం రచించారు. దాని ప్రకారము-

శ్లో॥ కులపూజా రతో భూయా దభీష్ట ఫల సిద్ధయే ।
వేదశాస్త్రోక్త మార్గేణ కుల పూజాం కరోతి యః ।
తత్సమీప స్థితా నిత్యం శివేన సహ శంకరీ ।
ఇదం సత్యమిదం సత్యం సత్యం సత్యం న సంశయః ॥

''వేద శాస్త్రోక్త మార్గము లో కుల పూజ చేస్తే శీఘ్రముగా కోరిక నెరవేరు తుంది'' అంటూ వేదోక్త పూజల లో తాంత్రిక క్రియలు చొప్పించి, ఆ ప్రకారముగా పూజా విధానమంతా మార్చివేసి, అదంతా వేదోక్తమని ప్రచారము చేసారు. దానికి అనుగుణం గా అనేక తంత్ర గ్రంధాలు పుట్టించి, అవన్నీ వేదసమ్మతములని, తాంత్రికము లేని పూజలు వ్యర్ధమని పేర్కొన్నారు- అంతే గాక అలా పూజించని వారిని దేవి శపించి సర్వనాశనము చేస్తుందని ఒక మహాభీతి ని ప్రజల లో సృష్టించారు తాంత్రికులు --

ఇందులో ప్రధానమైనది భావసంకరము. ఆది పరాశక్తి ''క్రూర శక్తి'' అన్నది ప్రథమ సంకరము. ఆమెకు మద్యము, పశుబలులు వర్ణాచార

రీత్యా ఇవ్వలేని బ్రాహ్మణులకు, వైశ్యులకు ప్రత్యామ్నాయాలు సూచించి ''భాగ సమాన తృప్తి''కి లోను కమ్మన్నారు. అనగా మేక కు బదులు కూష్మాండమని, సారాయి కి బదులు తేనె అని ఇలా సూచించి కూష్మాండ బలి ద్వారా మేకను ఇచ్చినట్లుగా భావించి తృప్తి చెందాలనే నియమము విధించారు- ఆ భావ సంకరము వల్లనే కూష్మాండ బలి ఇచ్చి, వాని ఖండాల కు కుంకుమ దట్టించి అవి మాంస ఖండాలు గా భావిస్తున్నారు నేడు అంతా. ఈ విధమైన భావసంకరత ''వేదిక''గా వేదోక్త పూజలు కలుషిత మైనవి. కాలక్రమేణ అసలు ఏది వేదోక్తము, ఏది కాదు అని సరిగా తెలియ జెప్పే వారు లేక, అంతా వేదోక్తమే అనే తాంత్రిక మాయ లో విలీనమై పోయింది మన సత్సంప్రదాయము - ఆ తాంత్రిక మాయ సప్తశతి లో ఎలా గోచరిస్తుందో పరిశీలించుడు.

ఇక్కడ శ్రీ మార్కండేయ మహాపురాణాంతర్గతమైన శ్రీదేవీ మాహాత్మ్య గాథ సంక్షిప్తముగా తెలుపుతాను--

శ్రీ మహావిష్ణువు ప్రతి ద్వాపరము లోను వ్యాసుని అవతారము దాల్చి పురాణ ప్రవచనము చేస్తుంటాడు. ఆ పరంపర లో ఇరవై ఎనిమిదవ వాడైన శ్రీకృష్ణద్వైపాయన నామ వ్యాసుడు శ్రీ మార్కండేయ మహాపురాణ కర్త.

ఈ పురాణము శ్రీ మార్కండేయ మహర్షి, భాగురి ల మధ్య సంభాషణ రూపములో వున్నది. వీరి సంవాదమును పక్షిరూపులైన మహర్షులు జైమిని కి బోధించారు.

ఇందు లో 77 వ అధ్యాయము నుండి 90 వ అధ్యాయము వరకు గల సావర్ణిక మన్వంతర గాథ లోనిదే శ్రీ దేవీ మాహాత్మ్యగాథ. సురథుడనే రాజు శత్రువుల చేతి లో ఓడి, తన వారే నిరసించ గా ఏకాకి గా బ్రహ్మజ్ఞాని అయిన సుమేధస ఋషి ఆశ్రమం చేరుకుంటాడు. సమాధి అనే వైశ్యుడు తన వారే వెళ్లగొట్టగా ఆ ఋషి ఆశ్రమానికే వస్తాడు. వారిద్దరి ప్రార్థన మేరకు ఋషి వారికి శ్రీదేవీమాహాత్మ్యమును వివరిస్తాడు. తర్వాత ఆయన ఆజ్ఞ మేరకు వారిద్దరు శ్రీదేవిని ఆరాధిస్తారు. ఆమె వారిని అనుగ్రహించి రాజా కు తిరిగి రాజ్య ప్రాప్తిని, మరుజన్మ లో సావర్ణి పేరు తో మనువు గా జన్మము

ప్రసాదిస్తుంది. వైశ్యున కు బ్రహ్మ జ్ఞానము ప్రసాదిస్తుంది. ఆ దేవీ అనుగ్రహము మహత్తర స్థితి ని ప్రాప్తింప జేస్తుంది - అని తెలిపేదే ఈ గాథ.

మధు, కైటభుల, మహిషాసుర, చండ, ముండ, రక్తబీజ, నిశుంభ, శుంభ వధలను ఋషి ఈ గాథలో వివరిస్తాడు-

కల్పాంతము లో శ్రీమహావిష్ణువు ఆదిపరాశక్తి ని ధ్యానిస్తూ యోగనిద్ర లో వుండగా, ఆయన కర్ణ మలము నుండి పుట్టిన మధు, కైటభులు బ్రహ్మ పైకి వస్తారు. వారిని విష్ణువు చంపుటకు, ఆయన ధ్యానించే మహామాయను బ్రహ్మ ప్రార్థిస్తాడు. అప్పుడు ఆమె విష్ణువు యొక్క నేత్రములు, ముఖము, నాసిక, బాహువులు, హృదయము నుండి తేజో రూపము తో బయలు వెడలి బ్రహ్మ కు దర్శన మిస్తుంది. యోగనిద్రా ప్రభావము వీడిన విష్ణువు ఆ రాక్షసుల తో ఐదువేల సంవత్సరాలు యుద్ధం చేసినా వారిని చంప లేని స్థితి లో దేవి వారి నాలుకల పైన నిలిచి విమోహితులను జేస్తుంది. బలగర్వితులై యున్నవారు విష్ణువుతో ''వరమిస్తాము- కోరుకో'' అంటారు. ఆయన వారి ని తన చేతి లో మరణించమని కోరగా, దేవి చేత విమోహితులై యున్నందున, ఆయన చేతి లో మరణిస్తారు-

మహిషాసురుడు వరగర్వితుడై దేవతల ను పదభ్రష్టులను జేసి పీడిస్తుండగా సర్వదేవతల తేజస్సు రాశీభూతమై అందుండి జగన్మాత స్త్రీమూర్తి గా అవతరించి మహిషుని సంహరిస్తుంది. దేవతలు ఆమెను స్తుతించి గంధ పుష్పాదుల తో అర్చిస్తారు.

శుంభ, నిశుంభులనే రాక్షసులు వరగర్వితులై దేవతలను పదవీచ్యుతులను జేయగా దేవతలు జగన్మాతను ప్రార్థిస్తారు. అప్పుడు ఆమె పార్వతి శరీరము నుండి కౌశికి గా ఉద్భవిస్తుంది. చండ, ముండులనే రాక్షసులు ఆమెను జూచి తమ ప్రభువైన శుంభుని తో చెప్పి, ఆమెను తెచ్చి ఏలుకొమ్మని ప్రేరేపిస్తారు- అతడు పంపిన సేనాపతి దేవినేత్రాగ్నికి భస్మమౌతాడు- చండ, ముండులు రాగా కౌశికి భ్రుకుటి నుండి ప్రభవించిన కాళి వారిని సంహరిస్తుంది. అందుకు దేవి ఆమెను ''చాముండా'' పేరుతో ఖ్యాతి గాంచ మంటుంది.

కోపించిన శుంభ, నిశుంభులు కాలకేయాది సర్వరాక్షస లోకాలను తోడు చేసుకుని దేవి పైకి వస్తారు- ఆ సమయం లో దేవీ శక్తు లైన బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి వారాహి, రాక్షస సంహారము చేస్తుంటారు. వారిని రక్తబీజుడు అడ్డగిస్తాడు- ఆతడి శరీరము నుండి చిందిన రక్తబిందువు ల నుండి కోట్లాది రాక్షసులు పుట్టుకొస్తారు. అప్పుడు కౌశికి ఆజ్ఞతో కాళి వాని నుండి స్రవించే రక్తమును పీల్చివేస్తుంది. నీరక్తుడైన వానిని కౌశికి సంహరిస్తుంది.

శుంభ, నిశుంభులు స్వయంగా దేవి పైకి రాగా ఆమె నిశుంభని వధిస్తుంది. అందుకు క్రుద్ధుడైన శుంభుడు ఇతర శక్తుల సహాయము తో యుద్ధము చేస్తున్నావని దేవిని హేళన చేస్తాడు. దేవి బ్రాహ్మి ఆదిగా అందరినీ తనలో ఐక్యము చేసికుని, జగత్తులో తాను ఒక్కతెనేనని, వారంతా తన విభూతులేనని పలికి శుంభుని సంహరిస్తుంది. దేవతలు ఆమెను స్తుతిస్తారు-

సుమేధస ఋషి దేవీ మహత్తును వివరిస్తూ ''సర్వేశ్వరేశ్వరి'' అయిన జగన్మాత ''నిత్య'' అయినా, దేవకార్యార్థము అనేక పేర్లతో, అనేక రూపాలు ధరించి దుష్ట శిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటుంది. దుష్టుల కు భయంకరముగాను, సాధువుల కు పరమ శాంత కారుణ్యమూర్తి గా దర్శనమిచ్చే ఆ మహామాయ సృష్టిలోని ప్రతి ప్రాణిని సంసార చక్రము లో పరిభ్రమింప జేస్తుంటుంది. సకల విద్యలు, కళలు, బ్రహ్మండము లోని సకల మాతృమూర్తులు, పశు, పక్ష్యాదులతో సహా, ఆ దేవీస్వరూపాలే అంటాడు. అందుచేతనే స్త్రీమూర్తులు ఎక్కడ పూజింప బడుతారో, దేవతలు అక్కడ నివసించి సకల శుభాలు కలిగిస్తారని మన భారతీ సంప్రదాయము ప్రబోధిస్తున్నది.

అట్టి జగన్మాతను శరణు జొచ్చి, పుష్ప గంధాదులతో ఆరాధిస్తే ధన ధాన్యాదుల ను, సంతతిని, ధర్మబుద్ధిని, మోక్షమును ఆమె అనుగ్రహిస్తుంది. ఆమె గాథలు వినినా, చదివినా సర్వతోముఖ శాంతి లభిస్తుందంటాడు సుమేధస ఋషి.

ఆయన చెప్పినట్లే రాజు, వైశ్యుడు దేవిని ఆరాధించి మనోభీష్టములను పొందుతారు.

ఈ గాథలోని బ్రహ్మకృత స్తోత్రవము, మహిషాంతకరీస్తవము, అపరాజితాస్తవము, నారాయణీ స్తవము లు సకల వేదసారములు. సుమేధస ఋషి మహామాయ ను ప్రశంసిస్తూ -

శ్లో॥ జ్ఞానినా మపి చేతాంసి దేవి భగవతి హి సా ।
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ॥

అంటాడు. మహాజ్ఞానులను కూడ ఆమె విమోహితులను జేస్తుంది.

ఇక్కడ ఒక సందేహము కలుగుతుంది. ఆధ్యాత్మ జ్ఞానుల కు కూడ మోహమా?

ఆత్మజ్ఞానమును గురించి శ్రీ ఆదిశంకరులు-

ఆధ్యాత్మ జ్ఞానం ద్వివిధం । పరోక్షమ్- అపరోక్షమ్-శాస్త్రతో అహం బ్రహ్మేతి జ్ఞానమ్ పరోక్షమ్-పరోక్ష జ్ఞానానంతరం శ్రవణాధిభిః గురు ప్రసాదేన చ తథా సాక్షాదనుభవో అపరోక్షమ్ । పరోక్ష + అపరోక్ష జ్ఞాన కార్యే-

పరోక్ష జ్ఞానతో నశ్యే దసత్త్వా వృత్తి హేతుతా ।
అపరోక్ష జ్ఞాన నాశ్యాహ్యాభానా వృత్తి హేతుతా ।
అభానావరణే నష్టే జీవత్వారోప సంక్షయాత్ ।
కర్తృత్వాద్యఖిలః శోకః సంసారాఖ్యో నివర్తతే ॥

గురుకటాక్షము తో అపరోక్ష సాక్షాత్కార పర్యంతము ఆత్మజ్ఞానులకు కూడ మోహస్థితి అనుభవ్యమానమే. ఇక్కడ ''సా జ్ఞానినాం మోహికాపి- ఏషా మహామాయా ఉపాసనయా ప్రసన్నా చేత్ అద్వైత సాక్షాత్కారం దదాతి అత ఏవముపాసక జనానాం ముక్తయే భవతి'' - ఉపాసించు వారికి ఆమె అద్వైత సాక్షాత్కారము ను ముక్తిని ప్రసాదిస్తుంది. ఆ మహామాయ యొక్క స్వరూపము సప్తశతిలో ఎలావుందో చూద్దాము.

## సప్తశతీ విధానము.

1. అధ్యాయములు పదమూడు-

2. పురాణ గాథను శ్రీ మహాకాళీ చరిత్ర, శ్రీ మహాలక్ష్మి చరిత్ర, శ్రీ మహాసరస్వతీ చరిత్ర- అని మూడుగా ఖండించారు.

ప్రతి చరిత్ర కు ప్రత్యేక న్యాస ధ్యానాదులున్నా ఆ యా దేవత ల మూల మంత్ర ప్రసక్తి వుండదు.

3. చండీ నవార్ణ మంత్ర న్యాసము కూడ పై విధాము గానే వ్యష్టి దేవతాత్మకము గా వుండి, పై దేవతల ప్రత్యేక ధ్యాన శ్లోకములతో వుంటుంది.

4. అంగములు-

ఆరంభము లో- కవచార్గళ కీలకములు, వైదిక రాత్రి సూక్తము, నవార్ణ జపము, శాపోద్ధార, శాపోత్కీలన మంత్ర పఠనము-

అంతమున- వేదోక్త, పురాణోక్త దేవీ సూక్తములు, తాంత్రిక, సరస్వతీ, లక్ష్మి, కాళీ సూక్తములు (ఇవి రుద్రయామళము- ''సప్తశతీ ప్రశంస'' లోనివి) తాంత్రిక రహస్య త్రయము, శాపోద్ధార, శాపోత్కీలన మంత్ర పఠనము-

5. పూజార్థము వైకృతిక రహస్యోక్త దశావరణ యంత్రము- వ్యష్టి దేవతాపూజ, మహిషాసుర పూజ.

6. బలివిధి.

''దేవీ పురో భాగే ఛాగాదికం వా- అశక్తశ్చే కూష్మాండాదికం వా సంపాద్య''- మేక ను సంపాదించ లేక పోతే- దాని బదులుగా కూష్మాండము-

''కౌశికే రుధిరేణాప్యాయతామ్'' అని రుధిరార్ఘ్యము. దీనికి మరల అశక్తశ్చే- అంటూ కుంకుమ ధట్టించిన అన్నము, కూష్మాండ ఖండములకు, టెంకాయ చిప్పలకు కుంకుమ పులిమి అవి మాంసఖండాలు గా భావిస్తూ-బలి-

## సప్తశతి పాఠ భేదములు.

సప్తశతి లో రక రకాలు గా పాఠ బేదాలున్నవి. ఒక దాని కొకటి పొంతన వుండదు. ఒక ప్రాంతపు ప్రతికీ మరొక ప్రాంతపు ప్రతికీ తేడా వుంటుంది. పేరు లో గూడ ''చండీ సప్తశతి'' ''దుర్గా సప్తశతి'' ''దేవీ సప్తశతి''- ఇలా తేడా లు గమనించ వచ్చును.

శ్రీ చండీ నవశతి ప్రశంస

రామకృష్ణా మఠము వారి ''శ్రీదేవీ మాహాత్మ్యము- లేక దుర్గా సప్తశతి'' 1987 ముద్రణలో న్యాసము, రాత్రిసూక్తము, తాంత్రిక సరస్వతీ, లక్ష్మీ, కాళీసూక్తములు, తాంత్రిక రహస్య త్రయము, శాపకథా మంత్రాలను తొలగించారు. ''స్తోత్ర మాత్రేణ సిద్ధ్యతి'' అన్న కీలకము లోని వాక్యము ను త్రికరణ శుద్ధిగా వారు అనుసరించారు. చండి ఆది పరాశక్తి గాబట్టి ఆమె గాథ తాంత్రిక మాలిన్యము లేనిది గా వుండాలని వారు భావించి యుండ వచ్చును.

బాల సరస్వతీ బుక్ డిపో వారి 1986 ముద్రణ ''శ్రీదేవీసప్తశతి'' లో తాంత్రిక సూక్త త్రయమును తొలగించారు. ''మా మాట'' లోవారు ''శ్రీ శంకరాచార్య కృత శ్రీదుర్గా, మహాలక్ష్మీ, మహాసరస్వతీ సప్తశతి'' అన్నారు- శ్రీ శంకారాచార్య అనగా శ్రీ ఆదిశంకరులు అని వారు భావించియుంటే, ఆచార్యుల వారు ''సప్తశతి'' అన్నమాట అయినా అన్నట్లు గాని, అందుకు కర్తలు గా గాని ఎక్కడా ప్రమాణము లేదు. ఇక పాఠభేదము ల గురించి పరిశీలిస్తే- మూల పురాణములో ఇలావుంది-

శ్లో॥ సప్పృష్టస్తే న కస్త్వం భో హేతుశ్చాగమనేఽత్రకః ।
సశోక ఇవ కస్మాత్త్వం దుర్మనా ఇవ లక్ష్యసే ॥

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచస్తస్య భూపతేః ప్రణయోదితం ।
ప్రత్యువాచ స తం వైశ్యః ప్రశ్రయా వనతో నృపమ్ ॥

రామకృష్ణా మఠం వారి ప్రతిలో ఇలాగే వుంది. ముంబాయి వారి ప్రతిలో-

శ్లో॥ సశోక ఇవ కస్మాత్త్వం దుర్మనా ఇవ లక్ష్యసే ।
ఇత్యాకర్ణ్య వచస్తస్య భూపతేః ప్రణయోదితమ్ ॥

అన్నది ఒకే మంత్రము-

''ప్రత్యువాచ స తం వైశ్యః ప్రశ్రయా వనతో నృపమ్ '' అన్నది మరొక మంత్రము.

బాల సరస్వతీ బుక్ డిపో వారు ముంబాయి వారి పాఠమనుసరించారు.

ఇక నిర్ణయ సాగరము వారి ప్రతిలో 17,18 మంత్రములివి.

శ్లో॥ ఏతచ్చాన్యచ్చ సతతం చింతయామాస పార్థివః ।
తత్ర విప్రాశ్ర మాఖ్యాసే వైశ్యమేకం దదర్శ సః ॥
సప్పృష్టస్తేన ------------ ఇవలక్ష్య సే ॥

ఇందులో 17వ మంత్రము లోని ఉత్తరార్థము, 18వ మంత్రము రెండు పాదములు కలిపితే గాని పూర్ణార్థము రాదు- అనగా 17వ మంత్రము తోకకు 18వ మంత్రము తలను చేర్చాలి. ఈ ఉదాహరణలు కొన్ని మాత్రమే-

పైవిధము గా పలు పాఠభేదములతో పూర్వోత్తర, ఉత్తరార్థములు కలుపుకుంటూ పూర్ణ మంత్రార్థము ను సాధించ వలసిన స్థితి సప్తశతి మంత్ర విభాగము లో గోచరిస్తుంది.

## మంత్ర లక్షణము.

''పద, బీజ, సంఖ్య, రేఖాత్మకమ్ మంత్రమ్'' అని శాస్త్రము. కర్త్రృ, కర్మ, క్రియా పదములతో సంపూర్ణార్థకమై, అనుష్ఠాత వాంఛను పూర్తిచేయు వాక్యము మంత్రము.

మనన త్రాణా రూపత్వం మంత్రమ్

శ్లో॥ మననాత్తత్త్వమర్థశ్చ ధ్యానాచ్చ సకలాద్వయాత్ ।
మంత్ర ఇత్యుచ్యతే ప్రాజ్ఞైః మంత్రజ్ఞైః ఋషిపుంగవైః॥

మంత్రములను దర్శించిన ఋషిపుంగవులు, సత్సంప్రదాయమును పాటించు ప్రాజ్ఞులు అనుష్ఠించునవి మాత్రమే మంత్రములు-

పురాణోక్త శ్లోకాలను మంత్ర విభాగము చేయుట లో శాస్త్రానుసారము అవి పూర్ణమంత్రములు గానే వుండాలి.

పూర్ణమంత్రములు శాంతి, తేజఃప్రదములు. అసంపూర్ణ మంత్రములు ధూమ తేజస్సును, అశాంతిని కలిగిస్తాయి-

సప్తశతిలోని మంత్ర విభాగం ఇట్లున్నది -

| | | |
|---|---|---|
| గద్య మంత్రములు | - | 56 |
| అర్ధ శ్లోక మంత్రములు | - | 38 |
| త్రిపాద మంత్రములు | - | 63 |
| శ్లోక మంత్రములు | - | 541 |
| పునరుక్తి మంత్రములు | - | 2 |
| | | ---- |
| | మొత్తం | 700 |
| | | ---- |

ఇందులో ''ఋషిరువాచ'' ఇత్యాది ఉవాచ లు గద్య మంత్రములు- శ్లోకములు పద్య మంత్రములు- ఇవి రెండూ కలిస్తేనే గాని సప్తశత సంఖ్య రాదు. ఈ విధముగా అర్ధమంత్రములు, పునరుక్తులు, మంత్ర లక్షణము లేని ''ఉవాచ''లు పరిశీలిస్తే ''సప్తశతి'' అనే సంఖ్యను ముందుగానే ఊహించి నిర్ణయించుకుని, దానిని సాధించేందుకై చాల ప్రయాసపడి, మంత్ర లక్షణ సూత్రమును విస్మరించినట్లు స్పష్టమౌతున్నది. అందుకు ఉదాహరణలివి-

శ్లో॥ యాదేవి సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥

స్తోత్రము లోని ఈ విధమైన ఇరవై రెండు శ్లోకాల ను సప్తశతి లో ఒక్కొక్కటి మూడు మంత్రాలుగా విభజించారు. ''యాదేవి --- నమస్తస్యై'' వరకు ఇరవై అక్షరాలు ఒక మంత్రము, తరువాత ''నమస్తస్యై'' నాలుగు అక్షరాలు రెండవ మంత్రము, ''నమస్తస్యై నమోనమః'' అన్న మిగిలిన ఎనిమిదక్షరాలు మూడవ మంత్రముగా చూపించి, 22 శ్లోకాలు 66 మంత్రాలుగా చూపారు.

''నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై'' అనునవి ఆదరా త్రిరుక్తములే గాని మూడు మంత్రములు కావు. అందుచేత ఈ విధమైన మంత్ర విభాగము

అప్రామాణికమని శిష్టులు భావించి, ఒక్కొక్క శ్లోకమును ఒక్కొక్క మంత్రము గానే నిర్ధారించారు-

ఇందు గురించి కొందరు మాత్రము సంప్రదాయ శుద్ధమైన త్రిమంత్ర శ్లోకాత్మకమే శాస్త్రీయమని వాదిస్తున్నారు. సంప్రదాయమే లేని, శుద్ధి అంత కన్నా లేని సప్తశతి ని ఏదో ఒక విధంగా సమర్ధించాలన్నదే వీరి తాపత్రయము.

## ఉవాచలు మంత్రములు కావు.

''ఉవాచ'' అనగా ఏమి చెప్పినది తరువాతి వాక్యము లో గాని తెలియదు. అది మరల ప్రత్యేక మంత్రము గదా! కథమువాచ, కిముువాచ, కిమర్ధమువాచ. ఇత్యాది ఆకాంక్షల కు ఉత్తర శ్లోకముల తో సమాధానము చెప్పుకుంటూ, కేవలము కర్త, క్రియలు మాత్రమే గల ''ఉవాచ'' లకు పూర్ణ మంత్ర లక్షణము లేదు గాబట్టి వానికి మంత్రత్వ మాపాదించుట శాస్త్ర విరుద్ధమని శిష్టులు ఏ నాడో నిర్ధరించారు.

తాంత్రికులు మాత్రము ''ఉవాచలకు మంత్ర స్వరూపము కల్పించి నందున వానిని మంత్ర సంఖ్య లోకి స్వీకరించాలి. అంతే గాదు మూల పురాణములో వానిని శ్లోక సంఖ్య గా లెక్కించారు'' అంటున్నారు. మంత్ర లక్షణము లేని వానికి మంత్రత్వమును కల్పించింది వారే. మూల పురాణములో మాత్రము వానిని శ్లోక సంఖ్య గా లెక్కించ లేదు. మంత్ర లక్షణము లేని వానికి తాంత్రికులు మంత్రత్వము కల్పించ గలరేమో గాని వానిని మంత్రములుగా జేయలేరు. అవసరము లేని చోట్ల కూడ సప్తశతి లో ఉవాచల ను మంత్ర సంఖ్యగా లెక్కించి నట్లు వారూ అంగీకరించక తప్పదు.

మంత్రములు సినిమా డైలాగులు, పాటలు కావు. వానికి పవిత్రత నిండిన లక్షణమున్నది- కాబట్టి పై విషయముల వలన సప్తశత సంఖ్య సాధన కొరకై బహు ప్రయాస పడినట్లు స్పష్టము. సప్తశత మంత్రములు లేని ఈ విభాగమును చూచిన తర్వాత సప్తశతి అన్న పేరే అర్థరహితమని భావించ వచ్చును.

ఇదిలా వుండగా నేను ప్రచురించిన శ్రీ చండీ నవశతి చూచిన తర్వాత ''యాదేవీ - - - '' ఇత్యాది 22 శ్లోకాలను ఒక్కొక్కటి ఒక్కొక్క మంత్రముగా

స్వీకరించి ముద్రించారు కొందరు. అలాగే ఉవాచలను మంత్ర సంఖ్య లోకి స్వీకరించ లేదు.

ఇది గాక మరొక సంస్కరణ చూడండి. కౌశికి భ్రుకుటి నుండి ఉద్భవించిన కాళి చండ, ముండాసుర వధాఘట్టము ఇలా నిర్వహించినట్లు దాదాపు అన్ని ప్రతుల లోను ఇట్లున్నది --

శ్లో॥ ఉత్థాయ చ మహా సింహం దేవీ చండమధావత ।
గృహీత్వా చాస్య కేశేషు శిరస్తే నాశినాచ్ఛినత్ ॥

అన్ని ప్రతుల లోను ''కాళి సింహము పైకెక్కి'' అనే అర్థమును వ్రాసారు. ఇది అన్వయము కానిది.

చండీ నవశతిలో నేను ''ఉత్థాయ చ మహాసిం'' ''హుం'' దేవీ చండ మధావత' అని ప్రచురించాను- నా సవరణ చూచిన తర్వాత కొందరు తమ పాఠమును సవరించుకుని ముద్రించారు-

బాల సరస్వతీ బుక్ డిపోవారు మాత్రము నేను సూచించిన సవరణ ముద్రించకనే, శ్లోకార్థము మాత్రము ''కాళి కోపముతో హుమ్మనుచు ఖడ్గమును ఎత్తి పట్టుకుని'' అని నా భావమునే వ్రాసారు. పాఠకులు గమనింతురు గాక!

## చరిత్ర త్రయము.

సత్త్వ, రజస్తమో గుణాత్మకము గా దేవి ఉద్భవించింది గాబట్టి ఆ విధము గానే సప్తశతి లో చరిత్ర త్రయ విభజన జరిగినట్లు తాంత్రికుల వాదన.

పురాణములో సుమేధస ఋషి రాజు, వైశ్యులతో--

శ్లో॥ దేవానాం కార్యసిద్ధ్యర్థమ్ ఆవిర్భవతి సా యదా ।
ఉత్పన్నేతి తదాలోకే సా నిత్యాప్యభిధీయతే ॥

నిత్య అయిన దేవి విశ్వమంతా వ్యాపించి యుంటుంది. దేవతల కార్యార్థము, రాక్షస సంహారానికై ఉద్భవిస్తుంటుంది అంటాడు ఋషి. ఈ ఉద్భవము త్రిగుణ పరముగా జరిగినట్లు సుమేధస ఋషి పురాణము లో ఎక్కడా తెలుప లేదు.

శ్రీదేవీ మాహాత్మ్య గాథను వినిపించినది సుమేధస ఋషి, విన్నవారు రాజు, వైశ్యులని తెలిపాను. ఆది లో రాజు ఋషితో--

శ్లో॥ భగవన్ కాహి సా దేవి మహామాయేతి యాం భవాన్ ।
బ్రవీతి కథముత్పన్నా సా కర్మాస్యాశ్చ కిం ద్విజ ॥
యత్స్వభావా చ సా దేవి యత్స్వరూపా యదుద్భవా ।
తత్సర్వం శ్రోతు మిచ్ఛామి త్వత్తో బ్రహ్మవిదాం వర ॥

మహామాయ యొక్క స్వరూప, స్వభావాదులు, అవె ఎలా ఉద్భవించినదీ- సర్వస్వము తెలుపమని అంటాడు. అందుకు ప్రసన్నుడైన ఋషి మధుకైటభ వధ గాథ వివరించి-

''ప్రభావమస్యా దేవ్యాస్తు భూయః శ్రుణు వదామి తే''

''ఆ దేవి యొక్క ప్రభావమును తిరిగి నీకు చెప్తాను. విను'' అని మహిషాసుర గాథ వివరిస్తాడు- చివరన ఆయన మరల

పునశ్చ గౌరీ దేహాత్సా సముద్భూతా యధా భవత్
... ... .... .... .... ... ... ...
తచ్ఛ్రుణుష్వ మయాఖ్యాతం యథావత్కథయామి తే ॥

''గౌరీ దేహము నుండి ఉద్భవించి దేవి రాక్షస వధను కావించిన తీరు యథా తథము గా చెప్తాను, విను'' అని చండ, ముండ, రక్తబీజ, నిశుంభ, శుంభ వధల గురించిన గాథ వివరిస్తాడు. చివరన ఋషి వారితో

''ఏతత్తే కథితం భూప! దేవీ మాహాత్మ్య ముత్తమమ్ ।'' అంటూ ''తాముపేహి మహారాజ! శరణం పరమేశ్వరీమ్'' ఆ దేవిని శరణు వేడి ఆరాధించమని ఫలశ్రుతి వివరిస్తాడు. కాబట్టి ఈ గాథ ఏక చరిత్రగానే పురాణంలో తెలుప బడింది.

అందులో దేవి ''ఏకైవాహం జగత్యత్ర ద్వితీయాకా మమాపరా?'' అని తన యొక్క తత్త్వమును తానే స్వయముగా వివరించింది. ''జగత్తులో తానం ఒక్కతెనేనని, బ్రాహ్మీ ఆదిగా గల శక్తులన్నీ తన యొక్క విభూతులే'' అని ఆమె పల్కినట్లుగానే ఋషి ఆమె గాథను ఏక చరిత్ర గానే వివరించినట్లుగా

పురాణము తెలుపు తున్నది. ఋషిగుణ ప్రధానంగా ఆమె చరిత్రను వివరించ లేదు.

ఆ కారణంగా ఈ చరిత్ర త్రయ ఖండనకు మూలపురాణములో నే ప్రమాణము లేదు. .గాబట్టి శ్రీమహాకాళీ చరిత్ర, శ్రీమహాలక్ష్మి చరిత్ర, శ్రీమహాసరస్వతీల పేర చరిత్రత్రయ సృష్టి అప్రామాణికము, అది తాంత్రికుల మత ప్రచారములోని అంతర్భాగమే --

ఏకాత్మకమైన చండీ గాథను వివరిస్తూ, ప్రథమ, మధ్యమ, ఉత్తమ చరిత్ర లంటూ ప్రత్యేక దేవత, ఋషి, ఛందస్సు, ధ్యానములు, ఆ యా దేవతల మూల మంత్ర ప్రస్తావన లేకుండ విధించుట, చండి అఖండ బ్రహ్మ విద్య అనే భావనకు విరుద్ధమైనది. అంతే గాక ఈ చరిత్ర ఖండన వలన దేవి వ్యష్టి రూపముగా దర్శనమిస్తూ ''ఏకైవాహం'' అన్న రూపమును తెర మరుగు పరుస్తున్నది. ప్రధానంగా తాంత్రికమైన రహస్యత్రయాదుల ధర్మమా అని ఆమె క్రూర తామసీ శక్తి గానే మిగిలి పోతున్నది.

సప్తశతిని సమర్థించే కొందరు ఈ చరిత్ర త్రయ ఖండన నవార్ణ మంత్ర బీజాక్షర పరము గా జరిగినట్లు వాదిస్తున్నారు. ఆప్రకారము (ఐం) మహాసరస్వతీ, (హ్రీం) మహాలక్ష్మి, (క్లీం) మహాకాళీ చరిత్రలు గా గదా వుండవలసినది. మరి అలా లేనందు వలన ఈ వాదన వ్యర్థము.

## మధుకైటభ వధ.

సప్తశతి వారు మధుకైటభ వధ శ్రీమహాకాళీ చరిత్ర అంటారు. ఈ రాక్షస వధార్థము బ్రహ్మ మహామాయ ను ప్రార్థించినట్లు గా పైన సంక్షిప్త గాథ లో వివరించాను- ఆమె గురించి ''సూతసంహిత'' లో ఇలా ఉన్నది.

శ్లో॥ చిన్మాత్రాశ్రయా మాయా యాః శక్త్యాధారే ద్విజోత్తమాః।
అను ప్రవిష్టాయా సంవిన్నిర్వికల్ప స్వయంప్రభా ॥
సదానందా సదాకారా సంసారచ్ఛేదకారిణీ ।
సా శివా పరమా దేవీ శివాభిన్నా శివంకరీ ॥

శ్రీ గోపానంద నాథులు

తాం వై సంసారనాశాయ సాక్షిణీమాత్మ రూపిణీమ్ ।
ఆరాధయే త్పరాం శక్తిం మహామాయాభిదామ్ శివామ్ ॥

సంవిన్నిర్వికల్ప స్వయంప్రభా, సంసారచ్ఛేదకారిణి, శివాభిన్నా, శివంకరీ, ఇత్యాది విశిష్ట తత్త్వము గల ఆ పరమేశ్వరి ని సంసార భయ నివృత్తికై ఆరాధించాలి. హరి హరాదులే ఆమె గురించి తెలిసికొన లేరు-

యోగ నిద్రా స్వరూపిణి అయిన ఆమె గురించి యే శ్రీమహావిష్ణువు కల్పాంతములో ధ్యానించేది.

యోగనిద్ర గురించి ''యోగ రహస్యము'' లో

శ్లో॥ యోగో జ్ఞానం తథానిద్రా తదభావోఽభిధీయతే ।
ఉభయోశ్చైవ సంయోగో యోగనిద్రేతి కీర్త్యతే ॥

నిద్ర సర్వాంగముల కు వ్యాపించి యుంటుంది. యోగనిద్ర లో అర్ధనిమీలిత నేత్రావస్థ, జ్ఞానాజ్ఞాన సముచ్చయ స్వాపసుఖం, ఏకాగ్రీకృత హృదయస్థితి వుంటుంది.

సర్వ వృత్తుల నుండి మనస్సు మరలింప బడినపుడు అది బ్రహ్మయందు లయమ్మై పరబ్రహ్మ భావము పొందును. అట్టి స్థితియే యోగానంద స్థితి. మహాయోగేశ్వరేశ్వరి యే మహామాయ.

ఆశ్రిత వత్సలుడు, విపన్న జన రక్షణా సమర్థుడైన శ్రీమహావిష్ణువు కల్పాంతము లో సామాన్య జీవి లాగ నిద్రావస్థలో మునిగిలేడు. తన నేత్రములనే మహామాయ కు ఆలయములుగా జేసి తపస్సమాధిలో ఉన్నాడు- తపస్సు జ్ఞాన స్వరూపము- యోగనిద్ర తపస్సమాధి. కాబట్టి యోగనిద్రా రూపిణి అయిన మహామాయ జ్ఞాన స్వరూపిణి. శుద్ధసత్త్వ గుణాత్మిక, జ్ఞాన ప్రద అయిన ఆమె తాపసీమూర్తి.

సత్సంప్రదాయ ప్రసిద్ధమైన ఆమె ఈ తత్త్వమునకు భిన్నముగా సప్తశతికి అంగమైన వైకృతిక రహస్యము లో ఇలా వర్ణింపబడింది-

శ్లో ॥ యోగనిద్రా హరేరుక్తా మహాకాళీ తమోగుణా ।
మధుకైటభ నాశార్థం యాం తుష్టావాంబుజాసనః ॥

అలాగే ప్రాధానిక రహస్యములో-

శ్రీ చండీ నవశతి ప్రశంస

శ్లో॥ మహామాయా మహాకాళీ మహామారీ క్షుధాతృషా ।
నిద్రాతృష్ణాచైక వీరా కాలరాత్రిర్దు రత్య యా ॥

''నిద్ర మహాకాళీ నామము. అది తామసీ లక్షణము. కాబట్టి బ్రహ్మ స్తుతించిన యోగ నిద్రయే మహాకాళి. ఆమె మధుకైటభ వధ నిర్వహించింది కాబట్టి ఈ గాథ మహాకాళీ చరిత్ర'' అంటారు తాంత్రికులు.

బ్రహ్మ మహామాయను స్తుతిస్తూ--

''కాళరాత్రిర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ దారుణా'' అంటాడు. కాళి రాత్రి స్వరూపము కాబట్టి మధుకైటభ వధ కాళీ చరిత్ర అని మరొక వాదన. అందు చేతనే సప్తశతి కి అంగముగా ''రాత్రిసూక్తము'' విధించబడింది.

''రాత్రి అనగా ఆనందము కలిగించేది. చిచ్ఛక్తి అయిన దేవి అట్టిదే రాత్రికి దేవికి లక్షణ సామ్యమున్నందున రాత్రికి ప్రతీకయే దేవి'' అంటారు తాంత్రికులు.

ఈ భావన అన్వయము కానిది. రాత్రి శబ్దమునకు ''రాతి భయం దదాతితి రాత్రిః'' ''కాలస్య రాత్రిః కాలరాత్రిః'' అనివ్యాఖ్య. భయజనకమైనది రాత్రి-

ఈ అర్థము ''సంవిన్నిర్వికల్ప స్వయం ప్రభ'' ''శుద్ధ సత్త్వగుణాత్మక - జ్ఞానప్రద '' ''తాపసి'' అయిన మహామాయ కు అన్వయము కాదు- సకల మంగళదాయిని యే కాళి. భయజనకమైనది కాదు-

శక్తి సంగమ తంత్రములో తిథి అధిదేవతా పరముగా ఇలా చెప్పబడింది.

| | | |
|---|---|---|
| దీపోత్సవ చతుర్దశ్యాః | - | కాలరాత్రి |
| అమావాస్య యా యుతా | - | మహారాత్రి |
| శ్రీకృష్ణ జన్మాష్టమీ | - | మోహరాత్రి |
| వైశాఖ శుక్ల అక్షయ్య తృతీయా | - | దారుణా రాత్రి |
| మార్గశిర కృష్ణాష్టమి | - | ఘోరరాత్రి |

ఇవి కాల విశేష పర్యాయముగా చెప్పబడినవి.

"కాలయతి, క్షిపతి, సంహరతి చరాచరమితి కాలః" కాలహంత్రీ అని దేవీ నామము. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థా సాక్షిణి కాలరాత్రి. నిశా దివస నాశనీ మహారాత్రి. సమ్మోహినీ మహాప్రళయ సాక్షిణీ మోహరాత్రి- ఈ విధముగా కాలమును నిర్ణయించు కాల స్వరూపిణి యే మహామాయ- "సూర్యస్సోమో యమః కాలో మహాభూతాని పంచ చ" అన్నందున నవ భూతములలో కాలము మహాభూతము.

బ్రహ్మ స్తుతించిన కాల రాత్రి, మహారాత్రి, మోహరాత్రి దేవీ నామములు కల్పాంతము లో వున్నకాల స్వరూపానికి అన్వయమవుతవి. కాలస్వరూపిణి కాబట్టి దేవి కాళి అనబడింది. ఆమె యే నవదుర్గా నామముల లోని కాళరాత్రి. ఈ పదములు ఆదిపరాశక్తి అయిన మహామాయ నుద్దేశించి తెలుపబడినవి. మధుకైటభ వధను విష్ణువు తో నిర్వహింపజేసినది మహామాయయే-

కౌశికి భ్రుకుటి నుండి ప్రభవించి చండ, ముండు లను చంపి "చాముండా" గా ఖ్యాతి పొందిన కాళి మహామాయ యొక్క విభూతి. కాలరాత్రి ఇత్యాది పదములు ఈమె కు అన్వయముకావు. కాబట్టి మధుకైటభ వధ కాళీ కృతమైనది కాదు. ఈ గాథ లో కాళీ ఉద్భవము లేదు- అందు చేత ఆమె చేసిన రాక్షస సంహారము లేదు.

ఏవో లక్షణ సామ్యము లూహించి కాళి రాత్రి స్వరూపము అంటూ ఆమె మధుకైటభ హంత్రి అనే తాంత్రికుల వాదన అర్థరహితమైనది.

ఇక్కడ మరొక ముఖ్య విషయము.. తాంత్రికుల కార్యక్రమాలైన శ్మశానములలో శవపూజలకు, శవాసన జపాలకు ఇతరములకు రాత్రి అనుకూలము కాబట్టి రాత్రికాలము వారికి ఆనందదాయకమైనది. తామసీ శక్తి ఆరాధన కు ప్రాధాన్యతనిస్తున్న కారణం గానే రాత్రి ని దేవి గా తాంత్రికులు భావిస్తారు. ఆ భావనా బలము తోనే వారు పురాణము లోని "ఏవం స్తుతా తదా దేవీ తామసీ తత్ర వేధసా" అన్నవాక్యము లోని "తామసీ" శబ్దమును కల్పించారు-

మహామాయ కు ''తామసీ'' లక్షణము లేదు కాబట్టి నేను చండీ నవశతి లో ''తాపసీ''గా దానిని సవరించి, సత్సంప్రదాయ పరముగా జ్ఞానమూర్తి గా దేవిని సూచించాను. పవిత్రమైన దేవీగాథకు తాంత్రికత పులుముటకై కల్పించినదే ''తామసీ'' శబ్దము.

## చండి మధుపానము చేసినదా?

మహిషాసుర వధా ఘట్టములో చండి మధుపానము చేసినందువల్లనే మహిషుని చంప గలిగింది అంటారు తాంత్రికులు. పురాణము లోని ''తతః క్రుద్ధా జగన్మాతా చండికా పాన ముత్తమమ్'' అన్న వాక్యము వీరి వాదన కు ప్రాణము.

కులాచార ప్రచారానికై సప్తశతి సృష్టించినట్లు నిరూపించేందుకు ఈ చండీ మధుపాన ప్రసక్తిబలమైన ఆధారము గా గోచరిస్తుంది. దీనికి దేవీ మూలతత్త్వము, ఉద్భవ గాథ పరిశీలించుట అవసరము.

ఆది పరాశక్తియైన చండీదేవి మూల తత్త్వమునుపైన తెలిపిన సూతసంహిత వాక్యములు, మధుకైటభ వధకై బ్రహ్మకృతస్తోత్రము, విపులీకరిస్తున్నవి. సంకల్పమాత్రము చేతనే సృష్టి, స్థితి, లయ కార్యములను బ్రహ్మ, విష్ణు, రుద్రులచే నిర్వహింప జేసే ఆ మహామాయ గురించి ఎవరూ తెలిసికొన లేరు. నిత్య అయిన ఆమె సాధుజన రక్షణకు, దుష్ట శిక్షణకు అవతారము ధరిస్తుంది.

పురాణము లో మహిషుని చేత పరాజితులైన దేవతలు త్రిమూర్తుల కు తమ గోడు వినిపిస్తారు. అప్పుడు సర్వదేవత ల నుండి ప్రభవించి ఏకమై పర్వతములాగ జ్వలిస్తుండిన తేజో రాశి నుండి నిత్య అయిన ఆ దేవి స్త్రీ మూర్తిగా అవతరిస్తుంది. ఆమె ఆకృతి కూడ ఒక్కొక్క దేవతా ''తేజము'' ఆమె ఒక్కొక్క అవయవముగా రూపొందుతుంది. శివుని తేజము ముఖము గాను, విష్ణువు తేజము బాహువులు గాను, బ్రహ్మతేజము పాదము లు గాను- ఈ విధముగా సకల దేవతా తేజ స్స్వరూపమే ఆమె శరీరము. అది

పాంచభౌతికము కాదు. జనన మరణాదులు లేనిది. కామక్రోధ లోభ, మోహ, మద మాత్సర్యాది స్పర్శ లేనిది-

ఆ మహాదేవి కి దేవతలు తమ తమ ఆయుధాలు ఆభరణాదులు సమర్పిస్తారు. కుబేరుడు ''దదావశూన్యం సురయా పానపాత్రం ధనాధిపః'' అమృతము నింపిన పానపాత్రను ఆ దేవికి సమర్పిస్తాడు-

సుర అనగా సుధ అని అర్థము- ''పాత్రమ్ పీయుష పూరితమ్'' అమృతము నింపిన పాత్రను ఆమెకిస్తాడు కుబేరుడు.

క్షీరసాగర మథనము వలన జనించినది అమృతము- శ్రీమహావిష్ణువు జగన్మోహినీ అవతారముదాల్చి అర్హులైన దేవతల కు అమృతము పంచాడు. అనర్హులైన రాక్షసులకు దానిని లభింపనీయ లేదు.

పురాణము లోని ''చండికా పానముత్తమమ్'' లో ఉత్తమ మైన పానము జగత్తు లో అమృత మొక్కటే. మరొకటి లేదు. అదియే ఆమె సేవించినది.

తాంత్రికులు పానమును సారాయి గాను దేవిని సారాయి సేవించే శక్తి గాను చిత్రించారు. సారాయి సేవించినందు వల్లనే ఆమె నేత్రములు ఎర్రగా అయినవి, అప్పుడు గాని ఆమె కు రాక్షసుని చంపగల శక్తి రాలేదు- కాబట్టి మధుపానము ''శక్తి ప్రదము'' అని వారి వాదన.

దేవి కి ''సర్వారుణా'' అని పేరు. అరుణ వర్ణమైన ఆమె నేత్రములు అమృత పానము చేత మరింత ఎరుపు దాల్చినవి. మహిషుని దుష్కృత్యములు చూసి అరుణిమ దాల్చినవి. అతడు క్షోభింప జేసిన సర్వజగత్తు కు తానే ''ఆత్మశక్తి'' కాబట్టి అమృతము సేవించి ఆ జగత్తును చైతన్య పరచింది దేవి. అమృతము వేరు- దేవతలు రాక్షసులు సేవించే మధువు వేరు- ఆ రెండుమాా ఒకటే అని భావించరాదు.

దేవి అమృత కలశమును ధరించుట లోని భావము ''అర్హత పొంది మోక్షార్థులై నన్ను ఆశ్రయించండి అమృతమనే మోక్షమును ప్రసాదిస్తాను'' అని అర్థము-

పురాణము లో దేవతలు దేవి ని స్తుతిస్తూ --

''మోక్షార్థిభిర్మునిభి రస్త సమస్త దోషైః
విద్యాసి సా భగవతి పరమా హి దేవి''-

సమస్త దోషములు తొలగిన మోక్షార్థులు అభ్యసించే సర్వోత్తమము, పరమ పవిత్రమైన బ్రహ్మవిద్యవు నీవే అంటారు - వారు.

అట్టి మహోత్కృష్టమైన దేవీ తత్త్వమును సప్తశతి వైకృతిక రహస్యము లో ఇలా వర్ణించారు.

శ్లో॥ శ్వేతాననా నీలభుజా సుశ్వేత స్తన మండలా ।
రక్తమధ్యా, రక్తపాదా నీలజంఘోరు రున్మదా ॥

''సర్వదేవ శరీరేభ్యోఽఽ విర్భూతా'' అంటూనే శ్రీమహాలక్ష్మి ని తాంత్రికులు దర్శించిన తీరు ఇది. ''ఉన్మదా'' అనగా ''ఉద్రిక్తః మదః- మధుపాన జన్యశ్చిత్త వికారో యస్యాః సా ఉన్మదా''- తాంత్రిక మధుపాన సేవన వలన జనించిన చిత్తవికారము గలది ఆ దేవి అనివారి వర్ణన. శ్రీమహాలక్ష్మి ధ్యాన శ్లోకములో కూడ ''సురాభాజనమ్'' అని ఆమె చేతికి కల్లుకుండ ఇచ్చారు తాంత్రికులు- ఇక్కడ వారి గ్రంథాల లో మద్యపాన విధి గురించి వ్రాసినది గమనింపుడు.

''యావన్న చలితే దృష్టిః యావన్న చలితే మనః తావత్పానం కుర్వీత''
''పీత్వా పీత్వా పునః పీత్వా పతిత్వా చ మహీతలే ।
ఉత్థాయ చ పునః పీత్వా పునర్జన్మ న విద్యతే ॥''

దృష్టి, మనస్సు రెండూ చలించే వరకు త్రాగాలి. త్రాగి, త్రాగి క్రిందపడిన తర్వాత లేచి మరల త్రాగితే పునర్జన్మ ఉండదు అని తాంత్రిక వేదము-

పాపదూరులై యమ, నియమాది సద్గుణ సంపదతో అనేక జన్మల పుణ్యఫలము వలనగాని మోక్షమురాదు అని సత్సంప్రదాయము ఘోషిస్తున్నది. వారికి మాత్రము త్రాగినంత మాత్రాననే అది లభిస్తుందట-

మహిషాంతకరి సర్వదేవతా తేజోమూర్తి అని ప్రశంసిస్తున్నాగాని, ఆమె సారాయి సేవించేది అని తాంత్రికులు చిత్రించి తమ మత ప్రచారానికై మహిషాసుర మర్దని తత్త్వమును వాడుకున్నారు. కులాచారము సర్వశ్రేష్ఠము,

''కౌళాత్పర తరం నహి'' అని వారు చేసే ప్రచారమునను, పండితులై యుండి కూడ కొందరు అంగీకరిస్తూ చండి ఒక ప్రత్యేక క్రూర తామసీ శక్తి అని భావిస్తున్నారు. పైన తెలిపిన భావ సంకరతకు మహిషాసుర మర్ధని మధుపానగాధయే ప్రబలతార్కాణము-

మనము ఆరాధించే దైవము ను మనదృష్టి తో మనకుగల అలవాట్ల పరిధిలో భావన చేయుటము నీచ కృత్యము- చండీ క్రూర శక్తి అనే దుర్భావన తో మనస్సు నలుగుతున్నా, పరంపర, పేరు తో తాంత్రికమైన సప్తశతికి వైదిక గంధము పులిమి పవిత్రమైనదని దానినే ఆరాధిస్తున్నారు చాలమంది. ''నిత్య,'' ''సర్వదేవతా తేజోమూర్తి,'' అయిన ఆ దేవిని దుర్భావముతో ఆరాధించుట పరమ నీచము, మహాపాపము- అలాటి ఆరాధన లు దుష్ఫలితాలనిస్తాయి-

## శాపకథ.

చండీ మంత్రమునకు శాపమున్నదని, అందు కొరకుగా శాపోద్ధార మంత్రమును చదివి ''శాపానుగ్రహం కురుకురు'' అని ప్రార్థించాలని, మరల శాపోత్కీలన మంత్రము పఠించాలని, సప్తశతీ విధానము- పారాయణాద్యంతాల లో విధించ బడిన విచిత్ర విధానము ఇది. ఈశాప కథా మంత్రాల లో కూడ ఏక పాఠము లేదు.

మహామాయా తత్త్వమును పైన తెలిపాను. పురాణము లో దేవి ''ఏకైవాహం జగత్యత్ర ద్వితీయా కా మమాపరా ?'' అని తనకు తానే స్వయముగా తన తత్త్వమును విశదీకరించింది. ఆమెను ''పరాపరాణాం పరమా'' అని బ్రహ్మ స్తుతించాడు. దేవతలు ''ఆద్యా'', ''యా ముక్తిహేతు రవిచింత్య మహావ్రతా త్వం'' అని అనాది, అనంతము అపరిచ్ఛిన్నము, ఇంద్రియ జ్ఞానాతీతము అని అఖండ బ్రహ్మవిద్యగా ఆ దేవిని స్తుతించారు. అట్టి జగన్మాత కు శాపమివ్వగల మరొక మహచ్ఛక్తి వున్నదా ? ఉండి వుంటే ''ఏకైవాహం'' అన్నదేవీ పలుకులు అసత్యము లని ఈ శాపకథ వలన భావించ వలసినదే గదా! అప్పుడు శ్రీదేవీ మాహాత్మ్యగాథ అంతా అసత్యమేనా?

''బ్రహ్మశాప విముక్తా భవ'' అని ఒక పాఠము. ఇలా దేవినే ప్రార్థించేటపుడు ఆమె కు శాపమివ్వగల శక్తి బ్రహ్మకే వుంటే మధుకైట భుల వధకై దీనుడై ఆమెను ప్రార్థించ వలసిన అగత్యమే లేదు-

అందువలన పొంతన లేనివి ఈ శాపకథలు. వారాహీ తంత్రము లో స్తోత్రము లన్నిటికీ పరశురాము ని శాపమున్నట్లు మరొక కథ. కాని ఆ శాపము విష్ణుసహస్ర నామ స్తోత్రము, గజేంద్ర మోక్షము, భీష్మకృత కారుణ్యకస్తవము భగవద్గీత, సప్తశతులకు మాత్రము వర్తించద ని మరొక కథ.

శివరహస్య పాంచరాత్రాగమము, మత్స్యేంద్ర సంహిత లో సదాశివుడు సర్వమంత్రముల సిద్ధి కొరకు ''సర్వమంత్రోత్కీలనాఖ్య విధానము'' చెప్పినట్లు ఒక కథ.

పరశురాముని శాపము సప్తశతికి లేదని వున్నప్పటికి మత్స్యేంద్ర సంహిత ననుసరించి శాపోద్ధార, శాపోత్కీలన లు సప్తశతి లో విధించినట్లు తాంత్రికుల వాదన. దీనిని బట్టి శాప మంత్రాలను విధిస్తేగాని తాంత్రిక మతానికి గొప్ప ఆకర్షణ, ప్రచారము లభించదని సప్తశతి తాంత్రికులు భావించినట్లు స్పష్టము.

ఈ శాపకథలకు ఎక్కడా ప్రమాణము లేదు గాబట్టి ఇవి తమ తమ మత ప్రచారానికై తాంత్రికులు ఎంచుకున్న ఒక ఆకర్షణ ప్రక్రియగా భావించాలి-

## తాంత్రిక సూక్తత్రయము.

సరస్వతీ సూక్తము, లక్ష్మీసూక్తము, కాళీ సూక్తములనే ఈ సూక్త త్రయము లు సప్తశతి కి అంగములు గా రహస్యత్రయ పారాయణకు ముందు విధించబడినవి. ఇవి ''రుద్రయామళము సప్తశతి ప్రశంస'' లోనివి. రుద్రయామళము తాంత్రికుల ప్రామాణిక గ్రంథము- ఈ సూక్తముల లోని కొన్ని శ్లోకములు పరిశీలింపుడు-

సరస్వతీ సూక్తము ।

దేవ్యువాచ-

సర్వదాతే మనోదేవ కులధర్మే సుపూజితం ।

------------------------------

వినా సూక్తం పఠేద్యస్తు స్తోత్రం సప్తశతీ చ ।
మాతృగామీ స విజ్ఞేయో నరకావాస తత్పరః ।
మమైవాజ్ఞాపరాధీ నో బ్రహ్మఘ్నానాం గతిం వ్రజేత్ ॥

లక్ష్మి సూక్తము ।

దేవ్యువాచ-
సూక్తమేత ద్వినాయస్తు పఠేత్సప్తశతీ నరః ।
స యాతి చ మహాఘోరం నరకం దారుణం బిలమ్ ।
లిప్యతే పరమైః శాపైః మమకోప విఘూర్ణితః ।
లక్ష్మీసూక్తం వినా సప్తశతీ న సిద్ధిశ్చతి ॥

కాళీ సూక్తము

శివ ఉవాచ

- - - - - - - - - - - - -

రక్త ప్రియాం మాంస మదావ ఘూర్ణాం ।
కాళీం శరణ్యాం శరణం వ్రజామి ॥

- - - - - - - - - - -

యే సాధకాస్తేఽను సరంతి మార్గం ।
కులాను వృత్తం పరమం పవిత్రం ॥

- - - - - - - - -

దేవ్యువాచ-
దేవీ సూక్తం వినా దేవి యేచ సప్తశతీం నరః ।
శోష్యంతి చ పఠిష్యంతి తేషాం శాపాః పదే పదే ।
దేవీ సూక్తం వినా పాఠోహ్యరణ్య రోదనం యథా ।
స్తోత్రత్రయేణ చానేన పూర్ణం స్తోత్రం భవిష్యతి ॥

సప్తశతి చరిత్రత్రయం క్రమం శ్రీ మహాకాళీ శ్రీమహాలక్ష్మి, శ్రీమహాసరస్వతీ క్రమములో కాకుండ ఈ సూక్తత్రయము సరస్వతీ, లక్ష్మీ, కాళీ క్రమము లో వుండుట గమనించుడు- వీనిలో కులధర్మము, కులమార్గనిష్ఠ, కులానువృత్తమ్ పరమశ్రేష్ఠములని సప్తశతి తో పాటుగా ఈ

సూక్తములను పారాయణ చేయకపోతే మాతృగామి అవుతాడు, ఘోర నరకప్రాప్తి కలిగి తమ శాపానికి గురి కాగలడు, చేసిన సప్తశతీ పారాయణ అరణ్యరోదనే అవుతుంది- అని సరస్వతి, లక్ష్మి, కాళి స్వయంగా పలికినట్లుగా వున్నది.

ఈ సూక్త త్రయము మూల పురాణము లోనిదిగాదు. మూల పురాణ శ్లోక శైలికి, ఈ శ్లోకశైలికి వ్యత్యాసమున్నది. ఇవి కేవలము కులాచార ప్రశంస కై ''సప్తశతీ ప్రశంస'' నుండి గ్రహింపబనందున, తమ మత ప్రచారాని కై తాంత్రికులు కల్పించిన ప్రక్రియ గా వీనిని గుర్తించనగును.

సప్తశతీ భక్తులు బహు పర్యాయములు సప్తశతీ ప్రశంసకై మహా వాక్యార్థాలను రుద్రయామళము లోనివిగా ప్రశంసించి ప్రస్తావిస్తుంటారు. అదే రుద్రయామళము, సప్తశతీ ప్రశంసలోని వైన పై మూడు సూక్తలలో ఆదిపరాశక్తి, ''పరాపరాణాం పరమా,'' ''అఖండ బ్రహ్మవిద్య'' అయిన దేవీ స్వరూపము, దేవీతత్త్వము ఎంత హీనముగా వక్రీకరించి, ''మహాభీతి''ని తాంత్రికులు సృష్టించారో గ్రహించ గలరు- పరమ పవిత్రస్తోత్రములో కులాచార ప్రశంస అవసరమేమి? దీనిని సప్తశతీ భక్తులు భక్తిగా పఠించాల్సిన అగత్యమేమి?

ఈ సూక్తత్రయ స్వరూపము ను గమనించి యెూ, సప్తశతి వైదికము అని సమర్థించుట కు ఇవి అడ్డుగా వున్నాయని భావించియెూ మరి ఈ సూక్తత్రయము ఇటీవలి సప్తశతి ప్రతుల లో అదృశ్యము చేసారు. మరి ఈ సూక్తవచన ప్రకారము వీని పారాయణ చెయ్యని వారు '' మాతృగామీ'' ఇత్యాది అయిపోయినట్లేనా? పాపము శమించుగాక!

ఈ సూక్తత్రయము అదృశ్యము కావటము వారి పరంపరను అతిక్రమించుటే అనుట స్పష్టము. ఆదిలోనే తెలిపినట్లు తమ మత ప్రచారానికై తాంత్రికులు అనేక గ్రంథాలు వ్రాసి, వ్రాయించి దేవీ తత్త్వప్రశంస బదులు, మత ప్రచారానికే ఎక్కువ కృషి చేసారు.

ఇలాటి సూక్తాల వల్ల దేవీ ఆరాధన విషయములో ప్రజలలో పరమ జుగుప్సత రేకెత్తిస్తాయి. అంతేగాక తాంత్రిక విధులన్నీ వేద సమ్మతములనే దుష్ప్రచార కారణంగా వేదోక్త సత్సంప్రదాయ పూజల విషయంలో వారిలో నీచభావమును కలిగించి, వానిని అసహ్యించుకునేలాగ చేస్తాయి.

భగవత్పరమైన స్తోత్రములను ముద్రించి ప్రకటించే వారు, తాంత్రిక స్తోత్రాలను ప్రకటించకుండ వుండటమే సంప్రదాయ సేవగా భావించుట మంచిది.

## యంత్ర పూజ - నవార్ణ జపము.

మంత్రమునకు గాని, యంత్రమునకు గాని ఏక దేవతా స్మరణ, ఆరాధన మన సత్సంప్రదాయ లక్షణము- వాని లక్ష్యము ఆ దేవతానుగ్రహసిద్ధి.

సప్తశతి వారు పూజించేది వైకృతిక రహస్యోక్త దశావరణ యంత్రము- ఇందులో చరిత్ర త్రయం క్రమంలో ముగ్గురు దేవతలు, దుష్టుడైన మహిషాసురుడు పూజింపబడుతారు. వీరి స్థాన నిర్ణయము లో గూడ సప్తశతి పాఠభేదాలు లాగనే, భిన్న సంప్రదాయాలున్నవి. ఏది ఏమైనా ఈ యంత్ర పూజా విధి సత్సంప్రదా యోక్త పూజా విధికి విరుద్ధమైనది.

సప్తశతి తాంత్రికులు చండీ దేవి ఆది పరాశక్తి, అఖండ బ్రహ్మ విద్య అని నమ్మరు. లలిత వేరు, చండివేరు, గౌరివేరు- అని భిన్న దృష్టితోనే దేవిని ఆరాధిస్తారు- విభిన్న తత్త్వము గల చండి క్రూర తామసీ శక్తి అనే వారి భావము- అందుకే పూజార్థము ''శ్రీచక్రము''ను స్వీకరించరు. కథా పఠన క్రమంలో ''ఏకైవాహం జగత్యత్ర'' అన్న శ్లోకము పఠిస్తారేగాని త్రికరణ శుద్ధి గా ఆ వాక్యార్థమును నమ్మరు. అందువలన వచ్చినదే దశావరణ యంత్ర పూజా వశ్యకత. అలాగే శ్రీచండీ నవార్ణ మంత్ర విషయము లో, దేవతా స్మరణ ''శ్రీమహాకాళీ, శ్రీమహాలక్ష్మీ, శ్రీమహాసరస్వత్యోః దేవతా'' అంటూ వ్యష్టిరూప భావన, ఆ విధంగానే త్రిదేవతా ధ్యాన శ్లోక పఠన ఇవి- సప్తశతి లోని తాంత్రిక సృష్టి. ఇది సత్సంప్రదాయ విరుద్ధమైనది-

## శ్రీ చండీ నవశతి ప్రశంస

సప్తశతి వైదికము అంటూ ''వేదశాస్త్రోక్త మార్గేణ'' కులపూజలు చేయించటానికే నవార్ణ మంత్ర ప్రస్తావనగాని, నవార్ణ మంత్రార్థ ప్రకారము చండి అఖండ బ్రహ్మవిద్య అని నమ్మికాదు- పై విషయములు వారి వ్యష్టి రూప భావనను, తాంత్రికతను ధ్రువపరుస్తున్నవి.

సత్సంప్రదాయానుసారము నవార్ణమంత్ర ధ్యాన శ్లోకము ఇలా వుంటుంది.

1. శ్రీదేవీమాహాత్మ్య గాథా పరముగా-

శ్లో॥ మాతర్మే మధుకైట భఘ్ని మహిష ప్రాణాపహారోద్యమే ।
హేలానిర్మిత ధూమ్రలోచన వధే హేచండ ముండార్దిని ।
నిశ్శేషీకృత రక్తబీజదనుజే నిత్యే నిశుంభాపహే ।
శుంభ ధ్వంసిని సంహరాశు దురితం దుర్గే నమస్తేంబికే ॥

శ్లో॥ యా దేవి మధుకైటభ ప్రమథినీ యా మాహిషోన్మాలినీ ।
యా ధూమ్రేక్షణ చండముండదమనీ యా రక్తబీజాశనీ ।
యా శుంభాది నిశుంభదైత్య దమనీ యా సిద్ధలక్ష్మీః పరా ।
సాచండీ నవకోటి శక్తి సహితా మాం పాతు విశ్వేశ్వరీ ॥

2. అఖండ బ్రహ్మవిద్యగా

హే నిర్ధూత నిఖిలధ్వాంతే, నిత్యముక్తే, పరాత్పరే,
అఖండ బ్రహ్మవిద్యాయై చిత్సదానందరూపిణీ,

చండికే త్వాం

వయం బ్రహ్మ, విష్ణు, మహేశ్వరా! అద్వైత
బ్రహ్మవిద్యాధి గమార్థం హృదయాంబుజే
సంతతం చిన్తయామః -

అహం చింతయామి.

నవార్ణ మంత్రార్థము ఇదే. దీని ధ్యేయము అద్వైత సిద్ధి. తాంత్రికులు ఈ స్థితికి ఎదుగ లేరు కాబట్టి వారికి అద్వైత బ్రహ్మవిద్యాధి గమార్థము దేవీ ఆరాధన అని స్ఫురణకు రాదు-

శ్రీ గోపానంద నాథులు

# రహస్యత్రయము.

సప్తశతికి ప్రాణము, ఆధారము రహస్యత్రయము. బ్రహ్మవిద్యాప్రబోధకమైన ''ప్రస్థాన త్రయము'' నకు పర్యాయము గా ప్రాథానిక, వైకృతిక, మూర్తి రహస్యము లనబడే ఈ రహస్యత్రయము సప్తశతి కి అంగము గా విధించ బడింది. ప్రస్థానత్రయమునకు గల ప్రాశస్త్యము దీనికీ వున్నట్లు ప్రజలను మభ్యపెట్టేందుకు, తమ మత ప్రచారానికీ తాంత్రికులు ఏర్పరచిన ఒక ఆకర్షణ మాత్రమే ఇది-

దీనిని సుమేథస ఋషి, రాజు, వైశ్యులకు వారు తపస్సుకు పోయే ముందు చెప్పినట్లుగా కథ. రహస్యత్రయం న్యాసము లో కూడ పాఠభేదాలున్నాయి.

''రహసి భవం రహస్యమ్'' అన్నందున ఈ రహస్యత్రయము లో గోపనీయమైన విషయమేది? అది అంత ప్రముఖమైనదైతే ఋషి మూల పురాణములోనే రాజు, వైశ్యులకు ఎందుకు వివరించలేదు? ప్రత్యేకంగా రహస్యంగా ఈ రహస్యత్రయము లోనే ఎందుకు తెలుప వలసి వచ్చింది? దీనికి ఈ రహస్యత్రయము ను పరిశీలిస్తే అవగతమవుతుంది.

రహస్యత్రయ ఆరంభము-

శ్లో॥ భగవన్నవతారామే చండికా యా స్త్వయోదితాః।
ఏతేషాం ప్రకృతిం బ్రహ్మన్ ప్రథానం వక్తు మర్హసి।
ఆరాధ్యం యన్మయా దేవ్యాః స్వరూపం యేన తద్ద్విజ।
విధినా బ్రూహి సకలం యథావత్ప్రణ తస్య మే॥

ఈ శ్లోకము మూల పురాణములోని ఈ క్రింది శ్లోకాన్ని పోలివున్నది.

శ్లో॥ భగవన్ కా హి సాదేవి మహామాయేతి యాం భవాన్।
బ్రవీతి కథముత్పన్నా సాకర్మాస్యాశ్చ కిం ద్విజ॥
యత్స్వభా వా చ సా దేవీ యత్స్వరూపా యదుద్భ వా।
తత్సర్వం శ్రోతు మిచ్ఛామి త్వత్తో బ్రహ్మవిదాం వర॥

పురాణము లో రాజు సుమేథస ఋషిని దేవి యొక్క స్వరూప స్వభావాదులు, ఉద్భవము- సర్వస్వము వివరించమని కోరినట్లు, ఆ ప్రకారమే ఆయన దేవీమాహాత్మ్యగాథను సంపూర్ణము గా వివరించినట్లున్నది.

అందులోని బ్రహ్మకృత స్తోత్రము, మహిషాంతకరీ స్తోత్రము అపరాజితాస్తవము, నారాయణీస్తవములు సకల వేదసారములై దేవీ పూర్ణతత్త్వమును ప్రబోధిస్తున్నవి.

ఋషి యొక్క వివరణ అంతా విన్న తర్వాత రాజు మరల ఆయననే దేవీ స్వరూపమును, తత్త్వమును తెలుపమని రహస్యత్రయారంభములో అడిగినట్లున్నది. ఇది అర్థరహితమైనది. కేవలము కల్పన.

దీనిని బట్టి రహస్యత్రయానికి ఆవశ్యకత లేక పోయినా కల్పించి, సంభాషణలు పురాణగాథ ను అనుకరిస్తూ కల్పించినట్లు స్పష్టమవుతున్నది. అంతేగాక దీని ద్వారా రహస్యత్రయము ఋషి బోధించినదే అని ప్రజలను నమ్మించుటకు చేసినది.

మహిషాసుర వధానంతరము దేవతలు దేవిని ''పరమాత్మను చేరుకునేందుకు యమ, నియమాది ఇంద్రియ నిగ్రహము తో మోక్షార్థులు చేసే మహావ్రతము నీవే'' ''బ్రహ్మవిద్యా,'' ''పరమార్తి హంత్రీ'' ''సదార్ద్రచిత్తా'' అని స్తుతించి నందనవనములోని దివ్యకుసుమాలతో, గంధ, ధూపాలతో ఆమెను అర్చిస్తారు. ఆమె ''తుష్టాస్మిస్తోత్రముఖ్యేన తద్దైవారాధనేన చ'' ''స్తోత్రారాధనల చేత సంతుష్టురాలనైనాను'' అని అంటుంది.

దేవతల యొక్క పరమోత్కృష్ట భావన కు విరుద్ధము గా రహస్యత్రయము లో దేవీ స్వరూపము మరియు ఆమెను ఆరాధించే విధానము లను ఋషి ఈ క్రింది విధముగా బోధించినట్లున్నది

కాళీ స్వరూపము.

ప్రాథానిక రహస్యములో తామసీ శక్తి అయిన కాళి ఖడ్గము పాత్ర, శిరస్సు, ఖేటము ధరించినట్లున్నది. వైకృతిక రహస్యములో ''పరిఘం కార్ముకం శీర్షం నిశ్చ్యోతద్రుధిరం'' ధరించి నట్లున్నది.

మహాలక్ష్మి స్వరూపము.

''రక్తమధ్యా రక్తపాదా నీలజంఘోరు రున్మదా'' తాంత్రిక మధుపానము సేవించినందు వలన జనించిన చిత్త వికారము గలది ''ఉన్మదా'' అయిన మహాలక్ష్మి అని వర్ణించారు-

కాళీవర్ణనలో శిరస్సు అనగా నరుని శిరస్సు. ''విశ్చ్యేతత్ గలద్రుధిరం- యస్మాత్ తచ్ఛీర్షం నృశీర్షం.'' రక్తము కారుతున్న నరశిరము ను ధరించినది. ఈ నరుడెవరు? ఆమె కు నర శిరస్సు ఎందుకు?

తాంత్రిక పూజల లో నరబలి, మద్య మాంసాదుల తో రక్త తర్పణాభిషేకాదులు విధిగా చెయ్యాలని తాంత్రిక గ్రంథాలు చెప్తున్నట్లు పైన తెలిపాను. పైన వర్ణించిన కాళీ స్వరూపము, లక్ష్మి స్వరూపములు తాంత్రిక పరమైనవి.

ఇక ఆరాధన ను పోల్చి తే దేవతలు దేవిని గంధ, పుష్ప ధూపాదులతోనే అర్చించారు గాని వారు మద్య మాంసాదు లర్పించినట్లు పురాణము లో లేదు- అదే వైకృతిక రహస్యము లో--

''రుధిరాక్తే న బలినా మాంసేన సురయా'' రక్తము తో కూడిన బలి మాంసము, మద్యము లతో దేవిని అర్చించాలని అలా అర్చించక పోతే--

''యో న పూజయంతే నిత్యం చండికాం భక్తవత్సలాం
భస్మీకృతాస్య పుణ్యాని నిర్ద హేత్పరమేశ్వరి ॥''

వాని పుణ్యము ను భస్మము చేస్తుంది దేవి అనే మహా భీతిని సృష్టించారు తాంత్రికులు--

దీనికి అనుగుణంగా ''కౌళావళీ నిర్ణయము'' అనే కౌళగ్రంథము లో ఇలా వున్నది-

శ్లో॥ వినాపీత్వా సురాం, భుక్త్వా మాంసం, గత్వా రజస్వలామ్ ।
యోజపేచ్చండికాం దేవీం దుఃఖం తస్య పదే పదే ॥

''సారాయి త్రాగక, మాంసం తినక, రజస్వలా స్త్రీ గమనము చేయక చండీ పూజ చేస్తే దుఃఖం ప్రాప్తిస్తుంది-'' ఇది తాంత్రిక దురాచారము.

తాంత్రిక సూక్త త్రయము లో సరస్వతి, లక్ష్మి, కాళి కులదర్మ ప్రశస్తి, అదీ ఆచరించని ఫలము గూర్చి వారే స్వయంగా పలికినట్లు పైన తెలిపి యున్నాను-

చండీ పేరు వింటేనే కలిగే మహా భీతి కి పైన తెలిపిన వే కారణములు-

మయాల పురాణము లో సుమేధస ఋషి అభివర్ణించిన దేవీ స్వరూపానికి, తత్త్వానికి, ఆరాధనా విధానానికి, రహస్య త్రయము లో ఆయనే తెల్పినట్లుగా కల్పించిన దానికి సామ్యమే లేదు- శ్లోకములలో కూడ భేదము గోచరిస్తుంది. దీనిని బట్టి అసలు సుమేధస ఋషి ఈ విధముగా రహస్యత్రయము బోధించాడా? ఆయన తత్త్వమేమి? ఆయన ఆశ్రమ స్థితి ఎట్లున్నది? పరిశీలించాలి.

పురాణము లో రాజు, ఋషితో -

''భగవన్ త్వామహం ప్రష్టుమిచ్ఛామ్యేకం వదస్వతత్''

''భగవన్ కాహి సా దేవి మహామాయేతి యాం భవాన్''

భగవన్ అనగా సర్వజ్ఞుడు అని అర్థము. ఇంకా ''శ్రోతు మిచ్ఛామి త్వత్తో బ్రహ్మవిదాం వర'' అంటాడు రాజు .

''బ్రహ్మవిన్దతీతి బ్రహ్మవిదః'' ఆత్మజ్ఞానినః -తేషాం వరః- శ్రేష్ఠః-

సుమేధ స ఋషి సర్వజ్ఞుడు, బ్రహ్మ జ్ఞానుల లో శ్రేష్ఠుడు- సంశ్రిత వ్రతుడుగా పురాణము తెలుపు తున్నది.

రహస్యత్రయారంభ శ్లోకములో గూడ ''భగవన్ '' అనే సంబోధించాడు రాజు ఆయనను. అనగా ''భగవన్'' అయివుండీ తాంత్రిక కులాచారము బోధిస్తాడు అనేదేవారి భావము, ప్రచారము.

శ్లో॥ ఇతి తస్య వచ శ్శ్రుత్వా సురథః స నరాధిపః ।
ప్రణిపత్య ''మహాభాగ'' స్తమృషిం ''సంశ్రితవ్రతమ్॥''

ఇందలి ''మహాభాగ'' పదమునకు ''సంశ్రితవ్రతమ్ '' పదమునకు వ్యాఖ్య ఇలావున్నదిః-

## మహాభాగ

''భగానాం. ధర్మ, జ్ఞాన, వైరాగ్యాణాం సమూహహా భాగం ।''

భగం జ్ఞాన, విరాగ,, ధర్మ, మాహాత్మ్య కీర్తిష్వితి శబ్దార్ణవః।

మహత్ భాగం యస్య స మహాభాగస్తం- ధర్మ, జ్ఞాన, వైరాగ్యాతిశయ సంపన్నమిత్యర్థః॥

సంశ్రితవ్రతమ్-

సంశ్రితమ్- తీక్ష్ణం, ప్రఖర మిత్యర్థః ॥

వ్రతమ్ బ్రహ్మచర్యమ్ - య స్య తం సంశ్రితవ్రతమ్ ॥

దీని ప్రకారము సుమేధస ఋషి బ్రహ్మజ్ఞానులలో శ్రేష్ఠుడు, ధర్మ, జ్ఞాన, వైరాగ్యాతిశయ సంపన్నుడు, దృఢవ్రతుడని పురాణం విశదీకరిస్తున్నది-

అంతే గాక ఆయన ఆశ్రమము గురించి- ''ప్రశాంత శ్వాపదాకీర్ణం మునిశిష్యోప శోభితం'' సాధు జంతువులు, క్రూర మృగాలు తమ యొక్క సహజ వైరమును విడిచి, మరచి, అన్యోన్యంగా మసలుతుంటాయి ఆయన ఆశ్రమములో. ''అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః'' అన్నందున అహింసా ప్రతిరూపుడైనందు వల్లనే ఆయన ఆశ్రమం అలా వున్నది. అది ''ప్రశాంతైః ముని ప్రభావాన్నిర్వైరైః'' ముని ప్రభావము చేత నే ఆ జంతువులు విరోధ భావము మరచి పోయినవి --

అటువంటి సుమేధస ఋషి మూల పురాణములో దేవిని అఖండ బ్రహ్మవిద్యగా బోధించి, తిరిగి ఆయనే రహస్యత్రయములో ''రుధిరాక్తేన బలినా మాంసేన సురయా'' ఆరాధించాలని, లేనిచో ఆరాధకుని పుణ్యమును ఆమె నశింప జేస్తుందని, భీతి కలిగే విధంగా తెలిపినట్లు వ్రాయుటము తాంత్రిక కల్పనే. అన్వయము కాని విషయము - విజ్ఞులు దీనిని నమ్మరు.

మూల పురాణములో దేవిని ఆరాధిస్తే --

''దదాతి విత్తం పుత్రాంశ్చ మతిం ధర్మే గతిం శుభామ్''

సంపదలు, పుత్రులు, ధర్మమతి, శుభగతి అనగా మోక్షమును ప్రసాదిస్తుందంటాడు. ఋషి - ధర్మమతి గలవాడే మోక్షార్హుడు - మోక్షమే తురీయ పురుషార్థము.

అదే రహస్యత్రయములో మహాకాళిని ఆరాధిస్తే చరాచర వశీకరణ, మహాలక్ష్మిని ఆరాధిస్తే సర్వలోక ప్రభుత్వము, మహా సరస్వతి ని ఆరాధిస్తే సర్వజ్ఞత్వము కలుగుతుందని వున్నది. జన్మరాహిత్యము కొరకు సప్తశతి అని మాత్రము లేదు.

మూల పురాణము లో తెలిపిన ఫలశ్రుతి దేవి ఉత్తమమైన ధర్మమతిని, మోక్షము ను ప్రసాదిస్తుంది అని వుండగా రహస్యత్రయము లో మరల అదే ఋషి అశాశ్వతము లైన చరాచర వశీకరణాదులిస్తుంది దేవి అని తెలుపుట అన్యాయము కానిది.

కాని తాంత్రిక పూజాఫలము అశాశ్వతము లైన వానిని మాత్రమే ఇస్తుందని రహస్య త్రయము స్పష్టపరుస్తున్నది. పైన సూచించిన వాని ఆధారముగా రహస్యత్రయము తాంత్రికము, శ్రీమార్కండేయ మహాపురాణోక్త దేవీ మాహాత్మ్యగాధ కు అంగము గా దానిని విధించుట అపచారమని భావించ వచ్చును.

మూలపురాణోక్త దేవీ గాధా వైశిష్ట్యాన్ని తెలిపాను. తాంత్రిక రహస్య త్రయము గురించి పైన వివరించాను.

ఈ పరిశీలన ఇలా వుండగా రహస్యత్రయము ను సమర్థించే వారి వాదనలు ఇలా వున్నాయి.

''రహస్యత్రయము ఖిల మార్కండేయము లోనిది. అది సప్తశతి కి అంగము గా కాదనుటకు ఎవరికీ శక్యము గాదు'' అని కొందరు.

''రుధిరాక్తేన బలినా మాంసేన సురయానృప'' అన్న వాక్యము ఋషి రాజుతో అన్నది గాబట్టి అది రాజు కు వర్తిస్తుంది. బ్రాహ్మణులు ఆ వాక్యార్థమును త్రోసి పుచ్చాలే గాని దాని ప్రకారము మాంసాదులను వారు దేవికి అర్పించరాదు. అని మరి కొందరు.

రహస్యత్రయము తాంత్రిక మని పైన తెలిపాను. అది ఖిల మార్కండేయము లోనిది అనే వాదన కూడ తాంత్రికులదే.

''రుధిరాక్తేన'' గురించి - పురాణము లోని చివరి అధ్యాయానికి ''సురథ వైశ్యయో ర్వరప్రదం నామ'' అని పేరు. దేవీ గాధను ఆద్యంతము రాజుతో పాటు వైశ్యుడు కూడ విన్నాడు.

''తయా త్వమేష వైశ్యశ్చ తథైవాన్యే వివేకినః'' ''అయం చ నిష్కృతః పుత్రై ర్దారై ర్భృత్యై స్తదోజ్ఝితః'' అనే వాక్యములు వైశ్యుని ఉనికిని ధ్రువపరుస్తున్నవి. అందుచేత ''రుధిరాక్తేన'' వాక్యము రాజుకు మాత్రము వర్తిస్తుంది అనే వాదన అర్థ రహితమైనది.

ఇక మద్య మాంసాదులను బ్రాహ్మణులు ''రుధిరాక్తేన'' వాక్యాను సారముగా దేవికి అర్పించరాదు, ఈ విధానము వారికి వర్తించదనే మాట రహస్యత్రయములోనే ఎందుకు చెప్పబడలేదు?

తాంత్రిక మతము వర్ణాశ్రమ ధర్మములకు అతీతమైనది. దాని స్వరూపమును ఆది లోనే వివరించాను. వర్ణ భేదమును పాటించరు. కాబట్టే తాంత్రికులు రహస్య త్రయములో బ్రాహ్మణులను గురించి ప్రస్తావించ లేదు. సప్తశతీ విధానానికి సంప్రదాయగంధము పులిమి, అది వైదిక సమ్మతమని సమర్థింప జూసే వారు మాత్రమే ఆ విధంగా ''రుధిరాక్తేన'' వాక్యమును త్రోసి పుచ్చాలి అంటున్నారు. సప్తశతిలో తాంత్రికత స్పష్టముగా గోచరిస్తున్నా చూడలేని వారే వారు. అది చూడ గలిగిన వారికి ఉలికిపాటు అంటూ వుండదు.

బ్రాహ్మణులకు స్వధర్మములైన గాయత్రీ జప, వేదాధ్యయనాదులు, గురువాక్యము, సత్సంప్రదాయమే ప్రథానములు. పరధర్మములు నిషిద్ధములు. అలాటి వారు తాంత్రిక రహస్యత్రయము ను ఏమి ఆశించి పారాయణ చేస్తున్నారు? పరంపర పేరు తో చేసే పర ధర్మాచరణ మహాపాపము.

సప్తశతి తాంత్రిక మనేది నిర్వివాదము. దానిని సమర్థించే వారిని గమనిస్తే ''వేదశాస్త్రోక్త మార్గేణ కులపూజ'' సత్సంప్రదాయము లో ఎంతగా వ్యాప్తి జెందినదీ గ్రహింప వచ్చును.

★★★

## బలి విధానము.

మన లోని కామ క్రోధాదుల ను కూష్మాండ రూపము లో బలి ఇమ్మని సంప్రదాయము నిర్దేశిస్తున్నది. యాగ ప్రాణులను, శిశువులను, నరులను బలి ఇచ్చి, జీవ హింస సోపానముగా ఇహ, పర సాధన చెయ్యమని ఎక్కడా చెప్పలేదు. జీవ హింస ఇహమును, పరమును ఇవ్వదు. నరకమునకు దారి చూపుతుంది.

సప్తశతి లోని బలి విధానము కలుషితమైన సంప్రదాయపు పూజలకు అర్ధము పడుతుంది.

తాంత్రికుల రుద్రయామళము లో--

శ్లో॥ ఛాగా భావేతు కూష్మాండం వా శ్రీఫలం మనోహరం।
వస్త్రం సంవేష్టితం కృత్వా చ్ఛేదయే చ్ఛురికాదినా ॥

మేకను బలి ఇవ్వలేక పోతే కూష్మాండమును బలి ఇవ్వాలి. కాళికా పురాణములో--

శ్లో॥ కూష్మాండ మిక్షు దండం చ మాంసం సా రసమేవ చ ।
ఏతే బలి సమాః ప్రోక్తా స్తృప్తౌ ఛాగ సమాస్సదా ॥

శ్లో॥ అవశ్యం విహితం యత్ర మద్యం తత్ర ద్విజః పునః ।
నారికేళ జలం కాంస్యే తామ్రే వా విసృజేన్మథు ॥

సనాతన సత్సంప్రదాయము విశిష్టమైనది. తాంత్రిక మతము తుచ్ఛము, నీచమైనది. కూష్మాండము, నారికేళము, తేనె, పాలు మన సంప్రదాయములో పరమ శుభకరమైనవి. తాంత్రికుల కుల పూజలలో మేక, సారాయి బలి కార్యములో విధిగా వాడవలసినవి.

పై శ్లోకములలో విశిష్ట వస్తువులు తాంత్రిక వస్తువులకు ప్రత్యామ్నాయములుగా సూచించబడినవి. అంతేగాక వాని బలి ద్వారా మేకను బలి ఇచ్చిన తృప్తి పొందమని తాంత్రిక సూచన. ఉత్తమమైనవి నీచమైన వానికి ప్రత్యామ్నాయములు కావు. ''వేదశాస్త్రోక్త మార్గేణ కులపూజ'' అనే తాంత్రికుల కుట్ర యొక్క ఫలితమే ''ఛాగసమాన తృప్తి'' అనే భావ సంకర

ఫలము. ''కౌళాత్పర తరం నహి'' అనే సిద్ధాంత రహస్యమే ''ఛాగసమాన తృప్తి'' ప్రబోధన.

వేదోక్త పూజల లో ఛాగ బలి అగత్యమే లేదు. అంగ...
బలి ద్వారా ఛాగ సమాన తృప్తి అనే దానికి అక్కడ ఆస్కా
భావేతు కూష్మాండమ్'' అన్నది దురాచారము. అది
ఫలము.

చాలమంది బ్రాహ్మణులు పై శ్లోకాలు
ఇవ్వరాదు గాబట్టి కూష్మాండము మేకకు ప్ర
భావిస్తున్నారు. ఆ భావన దురాచారము.

సప్తశతి లో ''కాళికే రుధిరేణాప్యా
దీనిని కొందరు భక్తులు మార్చి ''కాళికే కు
అంటారు. రుధిర శబ్దము ను మార్చగలరే
లాగనే ''రుధిర సమాన తృప్తి'' అనే భావ
అట్టిది.

ఆది లోనే భావ సంకరము వలన స
వ్రాసాను. తుచ్ఛమైన ఈ భావ సంకరతకు
పూజలను పునరుద్ధరించుట బ్రాహ్మణుల
గలవారు తాంత్రిక భావములను, విధానము
పర్రంపరాగతమని, ఆ తంతును ఆదరించ వ
భయావహః'' అన్న భగవద్వాక్యమే వారు
పూజావిధి ప్రక్షాళితమైన నాడే సత్సంప్రద

సప్తశతి బలి విధానము వలన వి
బ్రాహ్మణులు తుచ్ఛమైన తాంత్రిక
సంప్రదాయమును పరిపోషిస్తున్నారు. ఇది కడు దైన్యస్థితి అవ గ్రహించ
వలసినది.

సప్తశతి తాంత్రిక మనటానికి మరొక ఉదాహరణ.

మంత్రము ను, మంత్రశక్తి ని స్వార్థ, దుష్ప్రయోజనాల కు వినియోగించ రాదని సంప్రదాయము శాసిస్తున్నది. దీనికి విరుద్ధము గా

సప్తశతిని వశ్యాకర్షణ, స్తంభనోచ్చాటన, విద్వేషణ, మారణాది షడ్విధ స్వార్థ ప్రయోగాల కు వినియోగించ నగునని తాంత్రికుల మతము. సప్తశతి గురించి మేరు తంత్రము లో--

ప్రథమ చరితే మారణ మోహనాదయోః నవతి ప్రయోగాః ।
మధ్యమ చరితే ఉచ్చాటన స్తంభయోః శత ద్వయమ్ ।
ఉత్తమ చరితే విద్వేషణ వశీకరణ యోర్ద్వశాధిక చతుశ్శతమ్ సన్తీతి ।
సప్తశత ప్రయోగాశ్రయిత్వాత్సప్తశత సంజ్ఞేత్యుక్తమ్ ॥

ఈ భావనే సంప్రదాయ విరుద్ధమైనది. జన్మ రాహిత్యానికి, మోక్ష సాధనకు ఆరాధించే దేవిని స్వార్థ ప్రయోజనాల కు ప్రార్థించుట ఆమె కు చేయు అపచారము. పాపకృత్యమిది.

## సప్తశతి నామ భేదములు.

శ్రీదేవీ మహాత్మ్య గాథ ''శ్రీదేవీ మహాత్మ్యమని'' ''శ్రీ చండీ సప్తశతి'', ''శ్రీదుర్గాసప్తశతి'', ''శ్రీదేవీ సప్తశతి'' అని అనేక పేర్లతో వ్యవహరింప బడుతున్నది. అలాగే దేవి అనగా దుర్గనా, చండినా, చాముండినా అని అనేక సందేహాలున్నవి.

శ్రుతి శిరోరత్నమైన శతరుద్రీయము ఏకాదశ అనువాకముల తో ఏకాదశ రుద్రులను కీర్తిస్తూ పంచాక్షరీ తత్త్వమును ప్రబోధిస్తున్నది.

శ్రీమద్రామాయణము గాయత్రీ బీజాక్షర సమాన సంఖ్యా సహస్ర శ్లోకముల తో గాయత్రీ మహత్త్వమును బోధిస్తున్నది-

అదేవిధముగా శ్రీమార్కండేయ మహాపురాణాంతర్గత శ్రీదేవీ మాహాత్మ్యము ఆదిపరాశక్తి నవార్ణమంత్ర తత్త్వమును బోధిస్తున్నది-

పురాణాంతర్గత దేవీ గాథా శ్లోకాల ను శాస్త్రానుసారము మంత్రమాలగా నిర్దేశించే టపుడు దేవీ మూల మంత్ర ప్రబోధకముగా ఆమె తత్త్వము ఆ మంత్ర మాల లో ప్రతి బింబితము కావలసియున్నది. ఈ ప్రక్రియ లో దేవిని చండిగా గాని, దుర్గగా గాని భావించి తే చండి లేక దుర్గ మూల మంత్రము ను స్వీకరించి, తద్బీజాక్షర సంఖ్యా పరము గా అధ్యాయ సంఖ్యను, ఆ దేవత యొక్క యంత్రమును పూజార్థము స్వీకరించుట యుక్తము-

చండిని దేవిగా భావించి మూల మంత్రమైన నవాక్షరీ బీజభూతముగా దేవీ గాథ ను నవాధ్యాయము లతో నవశతి గా, నవకోణాత్మకమైన శ్రీ చక్రమును ఆ దేవీ పూజార్థము స్వీకరించాలి.

అలాగే దుర్గను దేవిగా భావించితే ఇదే విధమైన పద్ధతి అనుసరణీయము.

ప్రధానాంశము మాత్రము ఏకమూర్తి భావన, ఏకన్యాస ధ్యానాదులతో ఆ దేవీ గాథ ఏక చరిత్రగా ఆ దేవీ మూల మంత్ర సంపుటి తో చేసే ఆరాధన ఏకాగ్రతను, అద్వైత సిద్ధిని పరిపూర్ణతను ప్రసాదిస్తుంది. ఇదే పరమ శుభకరమైన విధానము. సప్తశతిలో ఈ పద్ధతి గోచరించదు కాబట్టి అద్వైత స్థితి శూన్యము-

భగవద్గీత లో ఇలావుంది

శ్లో॥ యజంతే సాత్త్వికా దేవాన్యక్ష రక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూత గణాంశ్చాన్యే యజంతే తామసా జనాః॥

సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్ష రాక్షసులను, తామసులు భూత ప్రేతములను ఆరాధిస్తారు-

లక్షణోజ్జ్వల దివ్యాంగి, భవనాశని అయిన చండిని ఐహిక, ఆముష్మికముల కొరకు సాత్త్విక సంకల్పము చేసి, సాత్త్విక బీజాక్షరయుత, సాత్త్విక మంత్రములతో ఆరాధించేవారు సాత్త్వికులు-

ఐశ్వర్యప్రాప్తికి, శత్రుక్షయార్థము చేసి, రాజస బీజాక్షరయుత రాజస మంత్రములతో చండిని ఆరాధించువారు రాజసులు-

''శీర్షం నిశ్చృత్య(తద్రుధిరం'' ధరించి, ''నీలజంఘోరు రువ్మదా'' అయిన దేవిని తామస సంకల్పము చేసి తామస బీజాక్షరయుత తామస మంత్రములతో ''రుధిరాక్తేన బలినా మాంసేన సురయా'' తామసీ శక్తిగా చండిని ఆరాధించేవారు తామసులు-

శ్రీ చండీ నవశతి ప్రశంస

గీతావాక్యానుసారము చండిని సాత్త్వికులు బ్రహ్మవిద్యగాను, రాజసులు యక్షిణి, రాక్షసిగాను, తామసులు భూత, ప్రేతముగాను ఆరాధిస్తున్నారు-

రుద్రయామళము సప్తశతీ ప్రశంస లో కులాచారము పరమ పవిత్రమని యున్నది- అందు శ్మశానములో శవపూజలు, శవాసనముపై జప కార్యములు అర్ధరాత్రి వేళల్లో అవశ్యాచరణీయములు.

అందువలన సప్తశతి వారి దృష్టిలో దేవి భూత, ప్రేతముగా భావించి ఆరాధింపబడుతున్నదనుట సుస్పష్ట విషయము-

శ్లో॥ విధి దృష్టంతు యత్కర్మ కరోత్యవిధినా నరః ।
ఫలం న కించిదాప్నోతి క్లేశమాత్రం హి తస్య తత్ ॥

అన్నయాజ్ఞవల్క్య ప్రవచనము ననుసరించి అశాస్త్రీయమైన సప్తశతి ఆరాధన నిష్ఫలమేగాదు క్లేశమును మిగుల్చుతుంది. అసంపూర్ణము, అసంతృప్తికరమైన ఆరాధనలన్నీ ఇదే ఫలమునిస్తాయి-

ఈ నాడు ప్రపంచాన్ని పట్టి పీడిస్తున్న హింసా ప్రవృత్తికి తామసిక తాంత్రిక భావములు, పూజలే కారణము- నీతి, న్యాయము, ధర్మము, సత్యములను నిలుపగల వారు లేరు. తామస ప్రవృత్తిని నిలువరించు వారు లేరు.

వేదాధ్యయనము, పండితగోష్ఠి నిర్వహించే వారింటి చిలక ఆ మాటలే వల్లిస్తుంది. వ్యాపారి ఇంటి చిలక బేర సారాలు పలుకుతుంది. అశ్లీలము పలికే వారింటి చిలక ఆ భాషనే మాట్లాడుతుంది. ఇది ఆవరణ ప్రభావము-

అందుచేతనే తామసీ శక్తిగా దేవిని సప్తశతి పేరుతో చేసే తామసీ తాంత్రికారాధనలు తామస ప్రవృత్తికి చిహ్నములు- అంతేగాక సప్తశతికి వైదిక గంధము పులిమి, ''వేదశాస్త్రోక్తమార్గేణ కులపూజ'' అనే ప్రవచనమును సమర్ధించే వారు కూడ తామసిక ప్రవృత్తికి అతీతులు కారు. తాంత్రిక ఆవరణను దాటగలిగితేనే వారికి ముక్తి-

సాత్త్వికులై రజో, తమో గుణాలను నిగ్రహించుకొమ్మని సత్సంప్రదాయము నిర్దేశించిన సూత్రమే అన్నికాలములకు, యుగములకు శ్రేష్ఠమైనది- శాంతి, సుఖ ప్రదమైనది.

ఆ మహత్తర వాక్యానుసారముగా పునరుద్ధరింప బడినదే చండీ నవశతి మంత్రమాల. దేవిని అఖండ బ్రహ్మవిద్యగా, ''యజంతే సాత్త్వికా దేవాన్'' అన్న వాక్యానుసారముగా, సాత్త్వికారాధనను నవశతి ప్రబోధిస్తున్నది. నవార్ణ మంత్రార్థ ప్రతిబింబితమైన నవశతీ విధానమును వివరిస్తాను. ప్రశాంత మనస్కులై విషయము గ్రహించ గలరు.

## చండీ నవశతి.

1. మూల పురాణ శ్లోకములు శాస్త్రానుసారముగా నవశత పూర్ణ మంత్రములుగా విభజింపబడినవి.

2. మంత్రార్థత లేని 'ఉవాచ' లను మంత్రములుగా స్వీకరించ లేదు.

3. అవైదికములైన తాంత్రిక రహస్యత్రయము, తాంత్రిక సూక్తత్రయము తొలగించబడినవి.

4. నవార్ణ మంత్ర న్యాసాదులు సత్సంప్రదాయ పరముగా గురుముఖైక వేద్యములని తెలుపబడినవి.

5. ''ఏకైవాహం జగత్యత్ర'' అన్న దేవీ చరిత్ర ఏక చరిత్రగా, ఏక న్యాస ధ్యానాదులతో నవశతి అవతరణ చూపబడింది.

6. మధుకైటభ వధా ఘట్టములో తాంత్రికులు యోగనిద్రకు ''తామసీ'' శబ్దము సూచించారు. దానిని తొలగించి ''తాపసీ'' గా చూపబడింది అలాగే ''పశుపుష్పార్ఘ్య'' ''పత్ర పుష్పైః'' గా చూపబడింది.

7. న్యాస మావాహనం చైవ నామాన్యర్గళ కీలకే ।
హృదయం చ దళం చైవ ధ్యానం కవచ మేవ చ ॥

అన్న శ్లోకానుసారముగా నవాంగములు నిర్దేశింపబడినవి. నామావళికి సత్సంప్రదాయ పరముగా శ్రీలలితా రహస్య నామములు స్వీకరించబడినవి.

8. నవసంఖ్య పూర్ణ సంఖ్య-

నవో నవో భవతి జాయమానో హ్నాం కేతు రుషసా మేత్యగ్రమ్।
భాగం దేవేభ్యో విదధా త్యాయ న్ప్ర చంద్ర మాస్తిరతే దీర్ఘ మాయుః॥ అని శ్రుతి-

9. నవార్ణ మంత్ర ప్రబోధకముగా చండిని అఖండ బ్రహ్మ విద్యగాను, నవశతి ధ్యేయము జన్మ రాహిత్యము కొరకు, అద్వైత సిద్ధి కొరకు గాను సూచింప బడినది. నవ సంఖ్యా పరముగా నవదుర్గలు, నవావరణలు, నవకోణములు, నవ చక్రములు ఇత్యాది నవార్ణ బీజభూతముగా నవాధ్యాయములతో నవశతి పునరుద్ధరింపబడినది.

నవశతిని పరిశీలించిన వారు కొన్ని సందేహాలు వెలిబుచ్చారు. వారి కొరకుగా-

1. సనాతన భారతీ సంప్రదాయము ఆసేతు హిమాచలము ఆచరింపబడేది. ఉత్తర భారతము, దక్షిణ భారతములని ప్రాంత ప్రాంతములకు ప్రత్యేక సంప్రదాయములు వుండవు. సమయ, దక్షిణాచారములు వైదికములు. వామ, కౌళాచారములు అవైదికములు-

''త్రిక'' సంప్రదాయము కాశ్మీరములో పుట్టినా, ఉత్తర భారతంలో కూడ శిష్టుల చేత నిషేధింపబడినదే. ''ఆగమసంధాన సమితి'' కలకత్తా వారు తాంత్రికుల గురించి అనేక గ్రంథాలు ప్రకటించారు-

2. సప్తశతి తాంత్రిక పూజలు రహస్యముగా కొందరి చేత, బహిరంగము గానే కొందరి చేత ఆచరింపబడుతున్నవి. గురు శబ్ద స్మరణ చేస్తూనే గురు వాక్యము ను నిరాదరించే వారున్నారు. కొందరి ''పరంపర''లో తాంత్రికత గోచరిస్తే పరిశీలన చేత గ్రహించి దానిని విసర్జించుట శ్రేయస్కరము- ''పరంపర'' పేరు తో అసంతృప్తి వేధిస్తూండగా దానిని ఆచరించుట ఆత్మవంచన- అదీ పాపమే.

3. చండి, గౌరి, లక్ష్మి, లలిత ఇత్యాది పేర్లన్నీ ఆదిపరాశక్తివే- అవి వేరు వేరని భావించ రాదు. అగ్ని, సూర్య, చంద్రులు కనిపిస్తున్నా, వారికి శక్తినిచ్చే పరాత్పరి అంతస్తత్వమే ఆరాధనీయము. తమస్సును, తమోగుణములను, తామసీ శక్తిని ఆరాధించరాదు-

4. సందేహములతో, త్రికరణ శుద్ధిలేని ఆరాధన నిష్ఫలము-

5. మంత్రములు స్వయంప్రభవములు. స్వయం ప్రకాశ మానములు. శక్తి, తేజః ప్రదములు. శబ్దబ్రహ్మాత్మకమైన వానిని గురు ముఖతః నే స్వీకరించి ఉపాసించాలి. పుస్తకము చూచి, రేడియో T.V.ల ద్వారాను విని, సామూహికముగా వానిని వినిపించగాను- స్వీకరించి చేసే ఉపాసన

దుష్ఫలితాలిస్తుంది. అలాటి సందర్భము లో మంత్రశక్తి శరీరము లోని ధాతువులను, అంతర్గత శక్తిని కర్కశముగా ఛేదించి ప్రమాద స్థితి కలిగిస్తుంది. సద్గురువు, సచ్ఛిష్యుడు, సన్మంత్రము, సన్మార్గోపాసన- ఇవి సత్సంప్రదాయ లక్షణములు-

6. నవశతి మంత్రమాలగా నిర్దేశింప బడినందున సద్గురు ముఖతః నవాక్షరిని గాని, దుర్గా మంత్రము గాని లేక దేవీ పరమైన ఏ మంత్రమును స్వీకరించినా, ఆ మంత్రన్యాస సంపుటితో నవశతి చేసికొనుట ఉత్తమము- అట్టి అవకాశము లేని ఇతరులు, ''ఓం'' లేక ''హ్రీం'' బీజాక్షర రహితముగా ''నామ పారాయణ'' రూపమున చేసికోవచ్చును-

ద్విజేతరులు, స్త్రీలు ''శ్రీం'' బీజ సహితముగా చేసి కొన వచ్చును. ''నామ పారాయణ ప్రీతా'' అని లలితా సహస్రనామము- నామపారాయణ పూర్ణఫలము నిస్తుంది- నవాంగము లోని కీలకములో-

శ్లో॥ సిద్ధ్యం త్యుచ్చాటనాదీని వస్తూని సకలాన్యపి ।
ఏ తేన స్తువతాం దేవి స్తోత్రమాత్రేణ సిద్ధ్యతి ॥

స్తోత్ర మాత్రముననే సకలాభీష్ట సిద్ధికలుగుతుంది. ఇక్కడ స్తోత్రమనగా శ్రీదేవీమాహాత్మ్యగాధ యే- ఈ పదమునకు ''సప్తశతి'' అని చెప్తూ, ''సప్తశతి చేసినంత మాత్రాననే సిద్ధి'' అని తాంత్రికులు తమ మత ప్రచారము చేస్తున్నారు- కీలకములో సప్తశతి ప్రస్తావనే లేనందున వారివ్యాఖ్య అసంబద్ధము, పెడదారి పట్టించేది- ఒక ప్రచార ప్రక్రియ-

7. నవశతిలో కొన్ని పదములు బ్రాకెట్లలో చూపబడినవి. అవి ప్రతి మంత్రము పూర్ణార్థకము గా వుండేందుకై చేసినవి. చదువరులు వానిని మానసికముగా పఠించి పూర్ణ మంత్రర్థానుభూతి పొందగలరు-

చండీ నవశతి మంత్రమాల పరిశీలించిన చాలమంది ఈ విధానమే యుక్తి యుక్తము, జ్ఞానప్రదమని, తమకెంతో సంతృప్తికరముగా వున్నదని తెలిపారు.

ఆ విధముగా నా కృషి సఫలీకృతమైనందుకు భగవత్కృప, సంకల్పములే కారణములు గా భావిస్తున్నాను-

శ్రీ చండీ నవశతి ప్రశంస

చండీ యాగాలు చేయించే వారు, చూచేవారు పై విషయములు గ్రహించి ఆత్మవిమర్శ చేసికో గలరు- వానిని అంగీకరించ లేని వారు సప్రమాణముగా విమర్శించ వచ్చును.

## ఉపసంహారము.

పురాణములో దేవి ఇలా బోధించింది-

''భక్తితో స్థిర చిత్తులై ఎవరు నా మాహాత్మ్య గాథలను పఠిస్తారో వారి గృహములో వుండి, భక్తులను మహామారి, ఉత్పాతములు, సర్వ బాధల నుండి రక్షిస్తాను. దుస్స్వప్నములు, రోగ, శత్రు బాధలు వారికుండవు.'' ''సంఘాత భేదే చ నృణాం మైత్రీకరణ ముత్తమమ్'' సంఘములో కుల, మత, ప్రాంతీయాది ద్వేషాలను నశింప జేసి, జనుల మధ్య సఖ్యత, మైత్రి ఏర్పరచి శాంతిని ప్రసాదిస్తాను. నా స్మరణ, భూత, ప్రేత, పిశాచములను నశింప జేస్తుంది. అంతేగాక నవశతి పారాయణ ''మమ సన్నిధికారకమ్'' నా సాన్నిధ్యాన్నే ప్రసాదిస్తుంది.''

జన్మరాహిత్యానికి ఇంతకన్నా మరొక విద్య లేదు-

సృష్టిలోని సర్వ జీవులకు దేవి ఇచ్చిన మహత్సందేశ మిది. కేవలము దేవతలకే కాదు.

సప్తశతి, నవశతి ల గురించి పైన తెలిపాను. సప్తశతీ విమర్శను తమ వర్ణ విమర్శగా కొందరు బ్రాహ్మణులు భావిస్తున్నారు- అది కేవలము వారి అపోహ మాత్రమే- తాంత్రిక కులాచార స్పర్శ లేని, ఉత్తమ నవశతి ఆరాధన ద్వారా బ్రహ్మతేజమును వారు జ్వలింప జేసుకుని సత్సంప్రదాయ పరులు కావలెననే నా ఆకాంక్ష.

సర్వేజనాస్సుఖినోభవంతు.

ఓం శాంతిః

18-1-33,
కపిలతీర్థము రోడ్డు,
తిరుపతి.

శ్రీదేవీభక్తజనపాదరేణువు
శ్రీగోపానందనాథులు.



సర్వహక్కులు ప్రచారకులవి

# మా ఇతర ప్రచార గ్రంథములు

| | |
|---|---|
| 1. శ్రీదేవీ మాహాత్మ్యము<br>చండీనవశతి పారాయణ గ్రంథము | రు. 25.00 |
| 2. నవశతి - తెనుగు అనువాదము | రు. 45.00 |
| 3. నవాంగవిధి | రు. 72.00 |
| 4. శ్రీదేవీ లఘుపూజా విధి | రు. 10.00 |
| 5. హోమ విధి | రు. 10.00 |
| 6. శ్రీనందవర చౌడేశ్వరీ చరిత్ర | రు. 15.00 |
| 7. శ్రీచౌడేశ్వరీ శతకము | రు. 10.00 |

పుస్తకము ఖరీదుతో పోస్టేజీ, ప్యాకింగ్ ఖర్చులు జతచేసి పంపినవారికి వి.పి.పి. ద్వారా పుస్తకము పంపబడును.

ప్రతులు దొరకు స్థలము :

శ్రీ గోపానందనాథులు
ప్రచారకులు
ఇ. నెం. 18-1-33.
కె. టి. రోడ్డ్,
తిరుపతి - 517 507

**Review Appeared in "THE HINDU"**
**Dated 31st August 1992.**



**<u>TELUGU</u>**

**SRI DEVI MAHATMYAM:** By Sri Gopananda Nathulu, 18-1-33, Kapilathirtham Road, Tirupati - 517 501.

Many Scriptures connected with Vedic creed, particularly the **"Mantra Sastra"**, have for long been misinterpreted and abused by selfish and foolish devotees and priests. Consequently, the true Vedic Spiritual doctrines have earned illfame. However, well-informed and well-meaning Scholars Sometimes come into picture, and set right what has gone wrong and redeem what is lost. Sri Sri Gopananda Natha is one such scholar who is well-versed in traditional Vedic learning. he has taken on himself the task of revising and re-editing **"SAPTHA SATI"** a collection of Hymns to Devi, forming part of Markandeya Puranam. He has thus rescued the text from selk-seekers who have abused and misused it for Tantric purposes *(Spells and Charms)* instead of the worship of Devi, the Deity. With this publication Sri Gopananda natha has restored the true import of the hymns and dispelled the false belief that they can be used for mundne selfish purposes. He has remoulded the Text as **"Nava Sati"** and published it with title, Devi Mahatmyam *(Sri Chandi Nava Sati Mantramala)*. The author has thus served the cause of the devotees of Devi. The book is welcome.

**G. APPARAO**

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 1.3 | క్షీరాబ్ధి | క్షీరాబ్ధి |
| 2.1 | మథ్యస్థిత | మధ్యస్థిత |
| 2.18 | రిఫ | రిఃఫ |
| 5.10 | భూర్భ | భూర్భు |
| 5.12 | రుజా | రుచా |
| 5.12 | పాశోత్పలా | పాశోత్పల |
| 5.13 | వ్రీహ్యాగ్ర | వ్రీహ్యాగ్ర |
| 6.7 | దీర్ఘముఖి | దీర్ఘముఖ |
| 6.24 | శూరాయ – మానుషాయ | శూర–మానుషాభ్యాం |
| 7.16 | అస్థ్వాత్మనే | అస్థ్యాత్మనే |
| 9.13 | న స్వయం | సః స్వయం |
| 10.1 | బ్రహ్మ | బ్రహ్మో |
| 1011 | ఆదిత్యచంద్రబ్రహ్మణే | ఆదిత్యచంద్రబ్రహ్మోభ్యో |
| 11.7 | అదితి | అదితీ |
| 11.11 | ఆద్యమా | ఆర్యమా |
| 13.4 | స్నిగ్ధా | స్నిగ్ధౌ |
| 14.8 | వృశ్చికాయై | వృశ్చికాయ |
| 15.11 | వారాణసి | వారాణసీ |
| 19.9 | పద్మరాగశిలాదర్మ | పద్మరాగశిలాదర్శ |
| 19.10 | సమాకర్షిదిగంతరా | సమాకర్షద్దిగంతరా |
| 20.13 | భూజాన్వితా | భుజాన్వితా |
| 20.15 | దళన్మథ్య | దళన్మధ్య |
| 21.29 | వథ | వధ |
| 22.33 | నిరగ్ధ | నిర్దగ్ధ |
| 22.35 | మథ్యకూట | మధ్యకూట |
| 22.38 | బ్రహ్మగ్రంథి | బ్రహ్మగ్రంధి |
| 22.38 | విష్ణుగ్రంథి | విష్ణుగ్రంధి |
| 25.69 | అనాదినిథనా | అనాదినిధనా |

| | | |
|---|---|---|
| 27.83 | క్రమారాధ్యా | క్రమారాధ్యా |
| 27.85 | నిర్వ్యాసుఖ | నిర్వ్యాణసుఖ |
| 27.88 | భానుమద్భామ | భానుమద్భాను |
| 27.91 | నిస్సీమమహీమా | నిస్సీమమహిమా |
| 28.101 | స్నిగ్ధాదనప్రియా | స్నిగ్ధౌదనప్రియా |
| 32.135 | రాజ్యలక్ష్మి | రాజ్యలక్ష్మీః |
| 33.143 | సుధావృష్టిః | సుధావృష్టిః |
| 33.151 | కామదుక్కామరూపిణీ | కామధుక్కామరూపిణీ |
| 36.174 | వ్యూమకేశీ | వ్యోమకేశీ |
| 36.183 | శివాశక్త్యైక్యరూపిణి | శివశక్త్యైక్యరూపిణి |
| 37.7 | మధ్యస్థిత | మధ్యస్థిత |
| 39.16 | విదేహి | విధేహి |
| 42.12 | తత్ప్రసాదేన | తత్ప్రసాదేన |
| 43.15 | సర్వాణి | పర్వాణి |
| 49.1 | బ్రహ్మ | బ్రహ్మ |
| 54.39 | లక్ష్మీ చ | లక్ష్మీం చ |
| 54.43 | గచ్ఛేతు | గచ్ఛేత్తు |
| 56.5 | పరదేవనా | పరిదేవనా |
| 56.7 | క్షేత్రయోః | క్షేత్రజ్ఞయో |
| 61.14 | బ్రహ్మగ్రంథి | బ్రహ్మగ్రంథి |
| 61.16 | విష్ణుగ్రంథి | విష్ణుగ్రంథి |
| 61.18 | రుద్రగ్రంథి | రుద్రగ్రంథి |
| 64.16 | తిరోధానకర్త్ర్యెయై | తిరోధానకర్త్ర్యై |
| 70.13 | అంబాస్వపిణ్యై | అంబాస్వరూపిణ్యై |
| 70.48 | వియదాదిజగత్ప్రసువే | వియదాదిజగత్ప్రసవే |
| 71.10 | శ్రీషాడ శాక్షర్యై | శ్రీషోడ శాక్షర్యై |
| 72.10 | ప్రతిపన్ముఖ్యరాకాంత తిథి | ప్రతిపన్ముఖ్యరాకాంత తిథి |
| 72.34 | దివ్యగంధాడ్యాయై | దివ్యగంధాఢ్యాయై |
| 77.4 | వియత్ప్రసువే | వియత్ప్రసవే |

| | | |
|---|---|---|
| 78.8 | ధనధాన్యవివర్ధిన్యై | ధనధాన్యవివర్ధిన్యై |
| 80.5 | వాంఛితార్ధ | వాంఛితార్థ |
| 82.3 | వినిర్దేశాయై | వినిర్దేశ్యాయై |
| 82.9 | ప్రసువే | ప్రసవే |
| 85.21 | ప్రాణనాడ్యై | ప్రాణనాథాయై |
| 86.6 | లబ్ధమనోదూరాయై | లబ్ధపాపమనోదూరాయై |
| 86.11 | లబ్ధవృద్ధయే | లబ్ధవృద్ధయే |
| 88.1 | భద్రకాళిన్యై | భద్రకాళ్యై |
| 89.23 | రక్షణేషు | రక్షణే |
| 89.24 | రక్షణేషు | రక్షణే |
| 89.25 | రక్షణేషు | రక్షణే |
| 89.26 | రక్షణేషు | రక్షణే |
| 89.27 | రక్షణేషు | రక్షణే |
| 90.1 | భార్యరక్షణేషు | భార్యారక్షణే |
| 90.2 | రక్షణేషు | రక్షణే |
| 90.3 | రక్షణేషు – కుమార్యై | రక్షణే – కౌమార్యై |